సాహిత్య
# ప్రస్థానం
ఏప్రిల్ 2013

వెల రూ. 10

అక్షరాంజలి

CHINUA ACHEBE

THINGS FALL APART

## ఆధునిక ఆఫ్రికన్ సాహిత్య పితామహుడు చినువా అచెబె


సీనియర్ పాత్రికేయులు
వాసిరెడ్డి సత్యనారాయణ


ప్రముఖ ఉర్దూ కవి
అలీ జహీర్


తెలుగు భాషోద్యమ నాయకులు
సి. ధర్మారావు


ప్రసిద్ధ సంగీత విద్వాంసులు
శ్రీపాద పినాకపాణి


ప్రముఖ మేకప్ ఆర్టిస్ట్
ఆడబాల

సాహితీ స్రవంతి

# అగ్నియోధుడు



వెనిజులా వేగుచుక్క ప్రత్యామ్నాయ శక్తుల చైతన్య పతాక హ్యూగో చావెజ్ అస్తమయం మాటలకందని విషాదం. నాలుగోసారి దేశాధ్యక్షుడుగా అప్రతిహత విజయం సాధించిన ఆ అచంచల యోధ రెండేళ్ల క్యాన్సర్ పోరాటంలో కన్నుమూయడం నమ్మక తప్పని నిజం. ఈ విషాద వార్త దేశాల సరిహద్దులకు అతీతంగా ప్రజాస్వామ్య ప్రియులు, స్వాతంత్ర్య పిపాసులందరిలోనూ శోకాన్ని రగిలించింది. ఎందుకంటే చావేజ్ ఒకానొక చారిత్రిక దశలో దిశా నిర్దేశం చేసిన ధీరుడు, ధీశాలి. సోవియట్ విచ్ఛిన్నానంతరం ప్రజాచైతన్యం, ప్రతిఘటన అన్నవి మటుమాయమై పోతాయని ఆశపడిన దుష్టశక్తుల దురాశలను దునుమాడుతూ అతి బలమైన అమెరికా సామ్రాజ్యవాదాన్ని అతి దగ్గర నుంచి సవాలు చేసిన సాహస సేనాని. సమర్థ పాలకుడు. చిల్లర వ్యాపారంలాటి రంగాల్లో ఇండియా విదేశీ పెట్టుబడులను అనుమతించడం లేదని అగ్రరాజ్యాధినేత ఒబామా పెదవి విరవడం... ప్రధాని అసమర్థ సాధకుడని, విషాద యోగి అని అమెరికా మీడియా తీసిపారేయడం... ప్రపంచ కార్పోరేట్ సంస్థలు ఇండియా స్థానాన్ని దిగువకు నెట్టడం... అన్యధా శరణం నాస్తి అన్నట్టు అమెరికా అదేశాలను అమలు చేసేందుకు ప్రధాని మన్మోహన్ సింగ్ ఆఘమేఘాల మీద పరుగులు పెట్టడం మొన్నటి ముచ్చటే. ఇలాటి ప్రపంచంలో ఒకడు... మన కన్నా చిలా చిన్నదైన దేశ పాలకుడు... అమెరికాకు అతి సమీపస్తుడు... నిన్నమొన్నటి దాకా అంకుల్ శ్యాం పెరటిదొడ్డిగా వారి కీలుబొమ్మలైన సైనిక పాలకుల చేతిలో నలిగిన, మెలిగిన చరిత్ర వారసుడు... ఐరాస సమావేశంలో ఆ అమెరికా అధినేతనే భూతంగా వర్ణించిన ఏకైక నాయకుడు చావేజ్. ప్రపంచ బ్యాంకు ఆదేశాల బాటలో దివాళా ఎత్తుతున్న దేశాలకు ప్రత్యామ్నాయం చూపుతూ మరెక్కడా లేనంత వేగంగా, తీవ్రంగా ప్రజానుకూల విధానాలు అమలు చేసిన పరిపాలకుడు చావేజ్. సైద్ధాంతిక పరిభాషలో కమ్యూనిస్టు కాకపోయినా కామ్రేడ్లకు ప్రపంచమంతటా ఊపిరిపోసిన సహచరుడు ఛావేజ్. ఒకే ఒక్కడు అనిపించుకున్న క్యూబా అధినేత ఫైడల్ కాస్ట్రో సరసన మరొకడుగా నిలిచే అర్హత సంపాదించుకున్న ధీమంతుడు చావేజ్.

ప్రపంచీకరణ యుగంలో వనరులను ప్రైవేటు పరం చేయడం రివాజుగా మారితే చావేజ్ అందుకు పూర్తి భిన్నమైన విధానాలు అమలు చేశారు. చమురు సంపన్నమైన వెనిజులా బడా సంస్థల కల్పవృక్షంలా ఉండే స్థితిని చావేజ్ మార్చేశాడు. ఆ వనరులను పూర్తిగా ప్రభుత్వ ఆధ్వర్యంలోకి తీసుకొచ్చి ప్రజలకు అంకితం చేశాడు. విస్తృత స్థాయిలో భూ సంస్కరణలు అమలు చేసి పేదలకు భూమిని పంచాడు. ప్రతిచోటా ఉద్యోగ భద్రత పోతుంటే వెనిజులాలో పని గంటలు వారానికి 44 నుంచి 40కి తగ్గించడమే గాక ఇంకా అనేక సరికొత్త హక్కులు కల్పించాడు. 1999-2010 మధ్య వెనిజులాలో దారిద్ర్యం 21 శాతం తగ్గిందని ఐక్యరాజ్యసమితి కమిషన్ అభినందనలు పొందాడు. నిరక్షరాస్యత నిర్మూలించి ఉచిత ఆరోగ్య వసతి కూడా కల్పించేందుకు చర్యలు మొదలెట్టాడు. తాను సైనిక నేపథ్యం నుంచి వచ్చినా, అమెరికా వత్తాసుతో నడిచే సైనిక కుట్రలకు తావులేకుండా ప్రజాస్వామ్యాన్ని విస్తరించాడు. అందుకే 1998లో మొదటిసారి ఎన్నికైన చావేజ్‌ను 2012లో కూలదోయడానికి సైన్యం ద్వారా కుట్ర జరిగితే వమ్ము చేసి దమ్ము చూపించాడు. తర్వాత దాదాపు ఏడెనిమిది సార్లు రెఫరెండంలు, రకరకాల ఎన్నికలు, రాజ్యాంగ రూపకల్పన, ఇలా ఏదో ఒక రూపంలో ప్రజల ఆమోదం పొందుతూ జైత్రయాత్ర సాగించాడు.

క్యూబాను దుర్మార్గ దిగ్బంధం చేయజూసే అమెరికా ఆంక్షలను తోసిపుచ్చి అగ్రజుడు కాస్ట్రోను అనుజుడుగా ఆదుకున్నాడు. భారతదేశంతో సహా అన్నిచోట్లా అభ్యుదయ శక్తులకు తోడైనాడు. సద్దాం హుస్సేన్‌ను కలుసుకుని సంఘీభావం చెప్పివచ్చాడు. చైనాతో చెలిమి చేశాడు. తనకు నచ్చని నాజర్, కాస్ట్రో, అరాఫత్, సద్దాం, వంటి వారందరిపైనా దాడిచేసినట్టే చావేజ్‌పైనా అమెరికా మీడియా సహాయంతో విష ప్రచారం సాగించింది. ఈసారి ఆయన ఓడిపోవడం ఖాయమని, కొద్దిపాటి తేడాతో నెగ్గినా చేయగలిగింది ఉండదనీ శాపనార్థాలు పెట్టింది. ఒక్కసారిగా అమెరికా పత్రికలు, చానెళ్లు చావేజ్‌పై చేయని దుష్ప్రచారం లేదు. ఆయనను ఓడించేందుకు వెనిజులా పెట్టుబడిదారులు, చమురు మాఫియాలు, అమెరికా హంగుదారులు ప్రతీఘాత ప్రతిపక్షాలు అందరూ కలిసి 30 పార్టీల కూటమిగా ఏర్పడి కాప్రిల్ అనే మితవాదిని నిలబెట్టి ఓడించాలని విఫలయత్నం చేశాయి. ఇన్నిటినీ తట్టుకుని అశేష జనాదరణతో అఖండ విజయం సాధించిన చావేజ్ ప్రమాణ స్వీకారం చేయడానికి కూడా లేకుండా ప్రాణాంతక క్యాన్సర్‌తో పెనుగులాడాల్సి వచ్చింది. అందుకోసం క్యూబాలో చికిత్స, కాస్ట్రోతో సాన్నిహిత్యం ఆయనను అఖరి వరకూ సజీవ స్ఫూర్తిగా నిలిపాయి. అయినా చివరకు ఆ వ్యాధి ఆయన ప్రాణాలు బలిగొనకుండా వదల్లేదు.

చావేజ్ చారిత్రిక పాత్రకు స్పష్టమైన భూమిక ఉంది. సామ్రాజ్యవాద, నయా ఉదారవాద ఎదురు దాడికి వ్యతిరేకంగా పెల్లుబికిన ప్రజావెల్లువ ఫలితంగానే వెనిజులాతో సహా అనేక లాటిన్ అమెరికా దేశాలలో ప్రజా ప్రభుత్వాలు ఆవిర్భవించాయి. దీన్నే 'పింక్ వెల్లువ-వామపక్షం వైపు మలుపు' అని పిలుస్తున్నారు. వీటి మనుగడ గొప్ప సానుకూల పరిణామం. ఈ పరిణామ క్రమానికి స్ఫూర్తిగా నిలిచిన హ్యూగో చావేజ్ కన్నుమూయడంతో ఈ క్రమాన్ని అడ్డుకోవడానికి సామ్రాజ్యవాద శక్తులు నిస్సందేహంగా కుట్రలు తీవ్రం చేస్తాయి. ఇప్పటికే ఆ కుటిల పన్నాగాలు మొదలైనట్టు కనిపిస్తుంది. ఆయనే చెప్పినట్లు విప్లవం ఏ ఒక్క వ్యక్తిపైనో ఆధారపడి ఉండదు. చావేజ్‌కు అశ్రుతర్పణ చేస్తూనే ఆయన ఆఖరి వరకూ అడ్డుకున్న ఆధిపత్య శక్తుల ఆటకట్టించడం ఇప్పుడు అవశ్య కర్తవ్యం. అయనకు అదే అసలైన నివాళి.

- తెలకపల్లి రవి

PRSU4O2A148

సాహిత్య
ప్రస్థానం
సంపుటి : 12 ఏప్రిల్ 2013 సంచిక : 4

# మరో విద్యుత్తేజం

పాటిమన్ను ప్లాటీనం బస్సు సీటు బ్రహ్మరథం ఏదైతేనేం పోటీ పడి కాటులాడ అని కాళోజి ఎప్పుడో రాసిన చందమే అనిపిస్తుంది రాష్ట్రం పరిస్థితి చూస్తుంటే. ఏ సమస్య తీసుకున్నా కారణాలు పరిష్కారాలు ఆలోచించకుండా నీ వల్లే అంటూ కాదు నీవల్లే అంటూ భీషణ దూషణలు. సంకుచిత స్వార్థపూరిత పాక్షిక రాజకీయాలు. కార్పోరేట్ కాపట్యాలు.

ఇదిగో ఇలాటి కలుషిత కల్లోలిత వాతావరణంలో కారు చీకట్లో కాంతి రేఖలా విద్యుత్ రేట్ల మోత, కోతలపై అందరూ గొంతు విప్పుతున్న దృశ్యం ఎంతైనా ఆహ్వానించదగింది. చరిత్ర పునరావృతమవుతుందన్నట్టు పుష్కరానికి పూర్వం బషీర్‌బాగ్ సాక్షిగా చరిత్రలో నిల్చిపోయిన సమరశీల అధ్యాయం పునరావృతమవుతున్న తొలి సూచనలు కనిపిస్తున్నాయి. అప్పుడు ఇప్పుడూ పాత్రధారులు మారివుండొచ్చు కాని ప్రజా ఉద్యమ సూత్రధారులే అప్పుడూ ఇప్పుడూ ముందున్నారు. గత ఉద్యమం సమయంలోనే సాహితీ స్రవంతి క్రియాశీల ప్రస్థానం ప్రారంభించింది. వికసించిన విద్యుత్తేజం కవితా సంకలనం కూడా వెలువడింది. ఒక విధంగా అప్పటి వరకూ ఒకింత స్తబ్దతలో వుందన్న తెలుగు సాహిత్యం పునర్వేగం పుంజుకోవడానికి అదే సందర్భమైంది. ఉత్తరోత్తరా ప్రపంచీకరణ వ్యతిరేక పోరాటాలకు ఆంధ్రప్రదేశ్ కేంద్ర బిందువుగా మారిందంటే అతిశయోక్తి కాదు. ఆ ప్రకారమే ఆసియా సామాజిక వేదిక సమావేశాలు కూడా హైదరాబాద్‌లోనే జయప్రదంగా జరిగాయి. తర్వాత కాలంలో పోరాటాలూ ఉద్యమాలూ సాహిత్య సంఘీభావాలూ తెలిసిన విషయాలే. ఈ ప్రస్థానం పత్రిక కూడా ఆ క్రమంలో రూపొందిందే.

ఈ కారణం వల్లనే ఇప్పుడు రాష్ట్రంలో విద్యుత్ సమస్యపై సాగుతున్న ఉమ్మడి ఉద్యమాలను మనసారా ఆహ్వానిస్తున్నాం. కార్పోరేట్ ప్రైవేటీకరణ నుంచి ప్రజలను కాపాడేందుకు ఇవి దోహదం చేయగలవని ఆశిస్తున్నాం. విద్యుత్ కోతలు, భారాల మోతలు తొలగిపోవాలని, సమగ్ర ప్రజానుకూల విద్యుత్ విధానం లభిస్తుందని విశ్వసిస్తున్నాం.

బొమ్మలు : తుంబలి శివాజి, వెంకటేష్, భాస్కర్

## ఈ సంచికలో...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# 'నువ్వూ-నేను-మనం'

అంతా...
కథంతా...
'డొల్లాభివృద్ధి'
విషగుళికను
'ప్రగతి'
రాదారిపై
నడిపిస్తూ-
సలాంగిరీ
ముసలాన్ని
గులాం బానిస
సంరంభ భ్రమణంలో
ఊరేగిస్తూ -
ఆర్థిక పతన
ఊతం అంకంలో
తాకట్టు త్రాసులో
పీకలదాకా
కూరుకుపోతూ-
చిన్నా, చితక
చిరు వ్యాపారుల
జీవన సాఫల్య
ఆ 'కలల్ని'
కబళించే
కరాళ నృత్య
భీకర
వికట్టాట్టహాస
ఛిద్రహేల !
ఈ నేల
వాడిది కాదు!
మన గాలి
జాడ
చెప్పలేదు వాడు !
మన
ఔన్నత్యం
వాడికంట్లో
నలుసై
సలుపుతూనేవుంది !
బిచ్చ మెత్తుకునే
వాడి
కుటిల బుద్ధి
శకుని పన్నాగాలు
పన్నుతూ వుంటుంది !
వ్యాపార నీతి
ఎరను
గాలం వేసి
దండుకోవటం
వాడికి
వెన్నతో పెట్టిన విద్యే !
గతానుభవాల
సారం
రెడ్ సిగ్నల్
చూపిస్తూనే ఉంటుంది !
వాడి
మేకవన్నె
పులితనం
మన బ్రతుకుల
ఊపిరిపై
గొడ్డలి పెట్టులా
పరిణమించిన
ఈ వైనం
మన బొక్కసానికి
బలాన్నిస్తుందా ?
బడుగుల
అర్థాకలి
అల్లకల్లోల
జీవితాల్ని
బడ బానల
సుడి వలయంలో
బలి కోరే
పెత్తందారీ హుకుం
సాకుల
వధ్యశిలపై
ఉరితాళ్ళను
పేనుతోంది !
పాలకుల
పాలనా (వి)లోచనలు
వ్యవస్థ గుండెల్ని
కుళ్ళబొడుస్తూ -
గంజినీళ్ళ
గరీబీల
ప్రాణాలను
కొడిగడుతున్నాయ్ !
గుప్పెడు
మెతుకుల
ఆకలి యాగంలో
బరువుగా
బ్రతుకు బండిని లాగే
నిస్తేజ
నరాల్లో
కోటి క్రాంతులు
కదం తొక్కాలి !
సరళీకరణ
సంపన్న సూత్రాలు
పరయీకరణ
ప్రగతి వేదాలు
బతుకుల్ని
బుగ్గి చేస్తోంటే....
నిగ్గుతో
ప్రశ్నించే
మేథస్సును - ఉషస్సురాగంలో
ఊపిరిపోస్తూ
పల్లవించాలి !
మనల్ని
మనమే
పాలించుకుంటూ-
ప్రగతికి
మళ్ళీ...పునాదులెత్తాలి !
ఈ దేశం
మనది !
దీని ఊపిరే
మనం !
నువ్వూ-
నేనూ-
మనందరం-
ఉక్కు శక్తులమై - కొత్త భాష్యాన్ని
ఉద్ఘాటించాలి !
బానిసత్వ
పోకడలకు
మంగళం పాడుతూ-
భరత మాత
స్వేచ్ఛకు భంగం రాకుండా
గమనం సాగాలి !
విఫణిలో
విలువపెంచుకునే
మూల్యాంకన
కసరత్తు-
మన వాళ్ళ
జీవిత వెలుగుల
ప్రవాహ ఒరవడిలో
ఒడుపుగా
వాదిగి పోవాలి !
దేశాభిమానాన్ని
ప్రపంచ నలుదిశలా
గొంతెత్తి నినదించాలి.!



వంగర పరమేశ్వరరావు
8143237847

# పాత్రోపదేశం

కథ



సాహిత్యప్రకాశ్

9492530542

మా సొంత ఊరు కర్నూల్‌నుంచి తుంగభద్ర ఎక్స్‌ప్రెస్ రైల్లో హైదరాబాద్ తిరుగు ప్రయాణమయ్యాను. నాకు రైలు ప్రయాణం అంటే ఎంతో ఇష్టం. కిటికీ దగ్గర కూర్చోవడమంటే మరింత ఇష్టం.

నేను రచయితను కావడం వల్ల బయటికి చూస్తూ, ప్రకృతిని ఆస్వాదిస్తూ ఏ పుస్తకాన్నయినా చదువుకోవడం జర్నీలో చేస్తూంటాను. రైలు వేగం పెంచింది. పచ్చని పైర్ల మీది నుంచి వచ్చే స్వచ్ఛమైన గాలి ఆహ్లాదంగా ఉంది.

వేగాన్ని పెంచుకున్న రైలు కాసేపటికి నెమ్మదించింది. ఏదో స్టేషన్ రాబోతోందన్నదానికి సూచికగా...

గద్వాల్ స్టేషన్ వచ్చింది.

రైలు ఆగగానే చదవటం ఆపి ప్లాట్‌ఫారమ్ వైపు చూశాను. ఎక్కేవాళ్లు ఎక్కుతున్నారు. దిగేవాళ్లు దిగుతున్నారు. నాదృష్టి ప్లాట్‌ఫారమ్ మీద ఉన్న ఇద్దరి మీద పడింది. తండ్రీ కూతుళ్లను కుంటాను. ఇద్దరూ కన్నీళ్ల పర్యంతమవుతున్నారు. కూతురికేదో జాగ్రత్తలు చెప్తూ, ఆప్యాయంగా ఆమె కన్నీళ్లు తుడుస్తూ, తల నిమురుతున్నాడు తండ్రి. అతణ్ణి పట్టుకుని ఆమె భోరుమంది. ఇంతలో కదులుతున్నానన్నట్టు రైలు శబ్దం.. తండ్రిని వదలలేక కూతురూ, కూతుర్ని వదలలేక తండ్రి అవస్థపడుతున్నారు. ఆ దృశ్యం నన్ను కదిలించింది. నా కళ్లలో సన్నటి కన్నీటిపొర.

“జాగ్రత్తమా...!” అని నాకు వినిపించేలా కూతురికి చెప్పి కదులుతోన్న రైలెక్కాడా తండ్రి. కూతురు ఓ చేత్తో కన్నీళ్లు తుడుచుకుంటూ,

మరోచేత్తో టాటా చెప్తోంది. తండ్రి కూడా తలుపు దగ్గరే నిలబడి ఆ కూతురు కనుమరుగయ్యేంత వరకూ చెయ్యి వూపాడు. రక్తసంబంధం అంటే అదే కాబోలు అనిపించింది. చెమర్చిన నా కళ్లను కర్చీఫ్‌తో అద్దుకున్నాను.

ఆ తండ్రి వచ్చి నాపక్కన సర్దుకుని కూర్చున్నాడు. భారంగా నిట్టూర్చాడు. ఓరకంట అతడ్నే గమనిస్తున్నాను.

కాసేపయ్యాక–

"ఎక్కడికెళ్లాలండీ...?!" పరిచయానికి నాందీవాక్యం పలికాను.

"మలక్‌పేట..!" చెప్పాడతను.

"గద్వాలకి ఏదైనా పనిమీదొచ్చారా?!" అడిగాను.

"అల్లుడింటికొచ్చాను. పండక్కి కూతుర్ని తీసుకొద్దామని.." చెప్పేటప్పుడు అతని గొంతు వణికింది.

"మరి... మీరొక్కరే...?! ప్రశ్నార్థకంగా చూశాను.

"అంతా నాకర్మ బాబూ... తల్లిదండ్రులు చేసిన పాపాలు పిల్లలకి శాపాలై చుట్టుకుంటాయంటారు. నా బంగారు తల్లి విషయంలో అదే జరిగింది. ఏ జన్మలో ఏపాపం చేశానో...!" బాధగా అన్నాడతను.

"ఐయామ్ సారీ అండీ...!" అన్నాను. మా ఇద్దరి మధ్య కాసేపు మౌనం.



"ఇంతకీ ఏం జరిగిందండీ...?" తెలుసుకోవాలన్న క్యూరియాసిటీ కొద్దీ అడిగాను.

"జరగడానికింకేం మిగల్లేదు బాబూ... జరగాల్సిందంతా ఎప్పుడో జరిగిపోయింది. నా బిడ్డ జీవితం సర్వనాశనం అయిపోయింది" కన్నీళ్ల పర్యంతమయ్యాడు.

"ఊరుకోండి... ప్లీజ్...!! ఆప్యాయంగా అతని భుజం మీద చెయ్యేసి అనునయించాను. కన్నీళ్లు తుడుచుకుని భారంగా నిట్టూర్చి చెప్పటం మొదలుపెట్టాడు...

* * *

నా పేరు ఆనందరావు. మాకు ఒక్కతే కూతురు...సీత. ఆస్తిపాస్తులున్నాయనీ, అత్తారింట్లో బిడ్డ సుఖపడుతుందని ఆశపడి ఓ దుర్మార్గుడికిచ్చి దాని గొంతుకోశాను.

పెళ్ళిలో కట్నం కింద అయిదు లక్షల రూపాయలు, ఇతర లాంఛనాలన్నీ ముట్టజెప్పాను కానీ అల్లుడు పచ్చి తాగుబోతు... తిరుగుబోతు... అన్ని వ్యసనాలూ వాడికి ఉన్నాయి.

రోజూ తాగొచ్చి బిడ్డను గొడ్డును బాదినట్టు బాదటం, అదనంగా ఇంకో అయిదు లక్షల కట్నం తీసుకుని రమ్మని హింసించడం చేస్తున్నాడు. చిన్నప్పటి నుంచీ ఎంతో గారాభంగా పెరిగిన నా బంగారుతల్లి నిత్యం నరకం అనుభవిస్తోంది. అల్లుడికి తోడు బ్రహ్మరాక్షసి లాంటి అతని తల్లి... నా బిడ్డను చిత్రహింసల పాల్జేస్తూ పనిమనిషికన్నా, హీనంగా చూస్తున్నారు. సీత అన్నీ మౌనంగా భరిస్తూ మాతో ఏమీ చెప్పేది కాదు. మమ్మల్ని బాధపెట్టడం ఇష్టంలేక ఎప్పుడు ఫోన్ చేసినా "బావున్నాను నాన్నా... మీ అల్లుడు ప్రేమగా చూసుకుంటున్నారు" అని పచ్చి అబద్ధం చెప్పేది. ఓసారి నా భార్యతో కలిసి బిడ్డని పండక్కి తీసుకెళ్దామని గద్వాల వెళ్లాం. బిడ్డ బాగా సన్నబడింది. చాలా నీరసంగా కనిపించింది. తలకి ఓ కట్టు కూడా ఉంది. "ఏమైందమ్మా?! అని ఆందోళనగా అడిగాను.

"ఏం లేదు నాన్నా.. బాత్రూమ్‌లో కాలుజారి కింద పడ్డాను. తలకి దెబ్బ తగిలింది. అంతే...! మళ్లీ అబద్ధం చెప్పింది అలవాటుగా... కానీ చెప్పేటప్పుడు నా బిడ్డ కళ్లలో నీళ్లు తిరగడం నా కళ్లారా చూశాను. అది నిజంకాదనీ, పచ్చి అబద్ధమని నాకర్థమయ్యింది. నా భార్యకి చెప్పుకుని బాధని పంచుకున్నాను. దాని కన్న పేగు మెలిపెట్టినట్టే కన్నీళ్లు పెట్టుకుంది. నా భార్యని ఓదార్చాను.

ఆ రాత్రి భోజనాల టైమైంది. అల్లుడింకా రాలేదు. "భోంచేయండి నాన్నా... మీ అల్లుడుగారొచ్చేసరికి లేటవుతుంది.." అంది. "పర్వాలేదులేమ్మా... పెద్దగా ఆకలి కూడా లేదు. అతగాడు రానియ్...!" అన్నాను. "లేదు నాన్నా... తనకేదో అర్జంట్ పనుందని మహబూబ్‌నగర్ వెళ్లారు. వచ్చేసరికి ఆలస్యమవుతుందని చెప్పారు...!" అంది మరో పచ్చి అబద్ధం... సరేనని మేం భోజనాలు కానిచ్చాం. ఎప్పుడూ చలాకీగా ఉండే పిల్ల ముభావంగా ఉండటం అంతకంతకీ నన్ను కలవరపెడుతోంది. నా బిడ్డ కష్టాల సుడిగుండంలో చిక్కుకుందని అర్థమైంది.

"నామీద ఒట్టేసి చెప్పమ్మా... అసలేం జరుగుతోంది తల్లీ...!" అన్నాను. "ఆ తలకికట్టు అల్లుడు కొట్టబట్టే కద సీతా..! నా భార్య అడిగింది. ఇక ఆగలేకపోయింది. వస్తోన్న దుఃఖాన్ని దిగమింగుకోలేకపోయింది. మమ్మల్ని పట్టుకుని భోరుమంది. మా మనసులు బాధతో చిగురుటాకుల్లా వణికిపోయాయి.

తన కాపురంలోని కలతలు, భర్త వ్యసనాలు, అత్త చిత్రహింసలూ ఒక్కొక్కటిగా చెప్తోంటే తట్టుకోలేకపోయాం.. ఇంతకాలం నా బిడ్డ సుఖంగా, సంతోషంగా ఉందనుకున్న మా ఊహలు సీత మాటల ద్వారా చెదిరిపోయాయి.

భార్యని తన మనిషిగా చూడాల్సిన భర్త పనిమనిషి కన్నా, హీనంగా చూస్తున్నాడని తెలిసి తల్లడిల్లిపోయాం. వాడిలో లోపాలు పెట్టుకుని నా బిడ్డలో లోపం ఉందనీ, గొడ్రాలని నిందవేశాడని తెలిసి భరించలేకపోయాను. ఆవేశం కట్టలు తెంచుకుంది. అల్లుడు కనిపిస్తే కాల్చి పడేయాలన్నంత కసిరేగింది. అల్లుడ్ని అడుగుతానంటే "వద్దు నాన్నా... అడిగితే నన్ను మరింత హింసిస్తాడు..".. అంది నా బిడ్డ.

"లేదు వాడ్ని అడగాల్సిందే..." నా భార్య కూడా గట్టిగా అంది "అడిగితే నా మీద ఒట్టే...!" అని మా ఇద్దరితో తన తలమీద చేయి పెట్టించుకుని ఒట్టేయించుకుంది.

అర్ధరాత్రి దాటాక అల్లుడనే దుర్మార్గుడొచ్చాడు... అదీ తప్పతాగి

తూలుతూ... మమ్మల్ని చూసి కూడా, మాట మాత్రంగానైనా కుశల మడగకుండా, అకారణంగా మా ముందే నా కూతుర్ని హీనంగా తిట్టాడు. నా బిడ్డ భయపడుతూనే సిగ్గుతో చచ్చిపోయింది. "కోడి కూర చేశావా లేదా లం.." అని పచ్చిబూతులు మాట్లాడుతూ సీత మీద చెయ్యిచేసుకున్నాడు.

ఆవేశంగా అల్లుడివైపు రాబోతోంటే వద్దన్నట్టు కూతురు చేతులు జోడించి దణ్ణం పెట్టింది.

ఆ స్థితిలో భూమి బద్దలై అందులో నేను కూరుకుపోయినా బావుణ్ణు అనిపించింది. ఆ ఘోరం మేం మరింత చూడకుండా వాడి చేయి పట్టుకుని లోపలికి తీసుకెళ్లింది సీత. ఆ రాత్రి మాకు నిద్ర పట్టలేదు. కన్నీళ్లతోనే తెల్లారింది.

పొద్దున్న మేం లేచేసరికల్లా అల్లుడు బయటికెళ్లిపోయాడు. అక్కడో నిముషం కూడా మాకు ఉండాలనిపించలేదు. కూతుర్ని తొందరగా రెడీ అవమని చెప్పాను. తను కన్నీళ్లు పెట్టుకుంది. కారణం... వాడు వెళ్లొద్దని చెప్పాడట... వెళ్తే అక్కడే ఉండు మళ్లీ రావడానికి వీల్లేదన్నాడట... వాడు మాకు మాట్లాడటానికే అవకాశం ఇవ్వకుండా తప్పించుకుని వెళ్లిపోయాడు.



అత్తగారిని అడుగుదామంటే సీత వద్దంది. తన కొడుకుమాటే తన మాటని అంటుందని బిడ్డ చెప్పింది. ఆ నిస్సహాయస్థితిలో అంతా శోక సముద్రంలో మునిగిపోయాం. పిల్లల్ని కంటాం కానీ వాళ్ల తలరాతల్ని కనలేం కదా... భగవంతుడు ఆ అవకాశం ఇచ్చినా బావుణ్ణు. నా బంగారు తల్లి బతుకిలా బుగ్గిపాలయ్యేది కాదు. ఇక చేసేదేమీ లేక భారమైన మనసుతో వెనుదిరుగుతోంటే– "నాన్నా... మీ అల్లుడిగారికి ఓ పాతికవేలు కావాలట..!" అంది బేలగా. అలాగే తల్లీ పంపిస్తాం... నువ్వు జాగ్రత్తమ్మా' అని చెప్పి బయల్దేరాం. అలాంటి పాతికవేలు పెళ్లయిన రెండేళ్ల నుంచి ఎన్నిసార్లో పంపాను. అయినా వాడిలో కనికరం లేదు. సీత బతుకులో మార్పులేదు. ఇరవయ్యేళ్లు పెంచి పెద్ద చేసిన బిడ్డ నాకు భారమవుతుందా? అని విడాకుల ఊసెత్తితే...

"వద్దు నాన్నా... చావైనా బతుకైనా ఇక్కడే... బాధలెన్నయినా భరిస్తాను గానీ భర్తకి దూరమై మీ పరువు తీయలేను అంది సీత. ఎంతో పెంకిగా పెరిగిన నా బంగారు తల్లికి భూదేవికున్నంత సహనం ఎలా వచ్చిందా?! అని ఆశ్చర్యమేస్తుంది. పెళ్లికి ముందు ఆడపిల్లకీ, పెళ్లయ్యాక 'ఆడ'పిల్లకీ ఎంత తేడా?! అది అక్కడ బాధతో కుమిలిపోతోంటే, మేమిక్కడ బండలైన దాని బతుకుని తలుచుకుని కుంగిపోతున్నాం... మళ్లీ ఆర్నెల్ల తర్వాత ఇదిగో ఇప్పుడు పండక్కి పిలుచుకుని వెళ్దామని వస్తే ఆ దుర్మార్గుడి మాటలు.. చేతల్లో ఏ మార్పులేదు. ఇంకా నా బంగారుతల్లి వాడి చెప్పుచేతుల్లోనే మగ్గిపోతోంది. 'అడవిలో మానుగా పుట్టినా పర్లేదుకానీ ఆడపిల్ల తండ్రిగా మాత్రం పుట్టకూడదు' అందుకే ఏమి చెయ్యలేక చేతులు ముడుచుకుని, కన్నీళ్లతో కడుపు నింపుకుని వస్తున్నాను బాబూ... వస్తున్నాను" అంటూ రుద్ధమైన కంఠంతో బోరుమన్నాడు ఆనందరావు.

అతన్నెలా ఓదార్చాలో అర్థం కాలేదు. ఎలా ధైర్యం చెప్పాలో బోధపడలేదు. కానీ కన్నీళ్లతో ఒకింత సానుభూతి మాత్రం చూపించగలిగాను తప్ప అతనికి ధైర్యం చెప్పే ధైర్యం చేయలేకపోయాను.

* * *

ఆరాత్రి... ఎంతకీ నిద్రపట్టలేదు. సీత సంసార జీవితం.. ఆనందరావు మాటలు నామనసుని కలిచివేశాయి. కదిలించివేశాయి. నా కళ్లముందు నా ఒక్కగానొక్క కూతురు 'వాణి' మెదిలింది. రేపు నా బిడ్డ పెళ్లయి అత్తారింటికెళ్తే...?! సీత కష్టాలు తప్పవా?! సున్నితంగా, సుకుమారంగా ఉండే నా వాణికి కూడా భర్త చేతుల్లో చావుదెబ్బలు తప్పవా ?! తిట్లూ, ఈసడింపులు తప్పవా..?! అప్పుడు నా పరిస్థితి ఇప్పుడున్న ఆనందరావు దుస్థితేనా..?! కష్టాలకడగండ్లేనా...?! కన్నీటి సంద్రాలేనా?! ఆలోచనల తిమిరాలేనా..?! వద్దు... అల్లారు ముద్దుగా పెంచుకున్న నా బిడ్డకి ఈ నరకయాతన వద్దు...ఈ బాధలొద్దు.. ఈ శాపగ్రస్థ జీవితం వద్దు... భరించలేను... లేదు.. భరించలేను. గట్టిగా కళ్లు మూసుకున్నాను. ఆశ్చర్యం..?! కంటి మీదకి కునుకురావడం లేదు.

తలకీ, చేతికి, కాలికి.. ఇలా రకరకాల గాయాలకట్లతో బేలగా ఏడుస్తోన్న నా కూతురు చేతులు చాచి 'రానాన్నా... నన్ను కాపాడు..' అని పిలుస్తున్నట్టు... అర్థిస్తున్నట్టు...! నాకూతుర్నలా చూడలేక, ఆబాధను భరించలేక బలవంతంగా కళ్లు మూసుకుని నిద్రకుపక్రమించాను.

"హలో రైటర్ గారూ...!" ఎవరిదో పిలుపు. నెమ్మదిగా కళ్లు తెరచి చూశాను. ఎదురుగా అస్పష్టంగా ఓ స్త్రీరూపం. 'ఎ...ఎవరిది...?! గట్టిగా నిలదీశాను. సమాధానం చెప్పకుండా పగలబడి నవ్వింది స్త్రీ రూపం. "ఎవర్నువ్వు...?! ఎందుకలా నవ్వుతున్నావ్...?!" రెట్టించాను. "పాపం... మీ బాధ చూళ్లేక..." అని మళ్లీ నవ్వింది.

"ఏంటీ...?! నేను బాధపడితే నీకు నవ్వొస్తుందా?! ఎంత శాడిజం..?!

"ఆ మాట నేననాలి దిగ్రేట్ రైటర్ గారూ...!!"

మర్యాదగా నువ్వెవరో చెప్తావా లేదా..?! విసుగు, కోపం మిళితం చేసి అడిగాను. "నన్నే గుర్తుపట్టకపోతే ఎలా సార్... నేనండీ...!"

"నేనంటే...?!

"కల్పన...!"

"ఏ కల్పన...?! ఆశ్చర్యంగా అడిగాను.

"మీ 'ముళ్లతీగ' కథలోని కల్పనని... భర్త, అత్త, ఆడపడుచుల చిత్ర, విచిత్రమైన హింసలకి బలైనదాన్ని...!" అంది స్త్రీ రూపం.

## జీరో అవర్

-మానాపురం రాజా చంద్రశేఖర్
9440593910



రాత్రంతా నాది పగటి నిద్రే !
రెప్పలు మూసివుంచినా తెరిచినట్టే ఉంటాయి.
ఊర్మిళాదేవి సంచారానికి ముందు
అర్థ నిమీళిత చూపులతో
కనుకొలుకుల మీద నేత్రావధానం చేస్తుంటాయి.
మనసు పొరల్లోని దృశ్యం
దానంతటదే ఊగిసలాడుతుంటుంది.
పాపం పిచ్చోళ్ళు
చూసిన నాళ్ళకేం తెలుస్తుంది?

జీవితంలోని
సగం చూపు మెలకువని!
సగం నిద్ర చీకటి బతుకు మత్తని !
రెప్పల తలుపులు తెరిచిన ప్రతిసారీ
కొత్త అనుభవమేదో
సరికొత్త ఊహగా మొలకెత్తి,
నిత్య చైతన్య సంభాషణల మధ్య
అవిశ్రాంతంగా నాలోంచి
దృశ్యాదృశ్యంగా నడిచెళ్ళిపోతూనే ఉంటుంది !!



"ఆ... అయితే...?!

"మీ కూతురి గురించి తెగ బాధపడిపోతోంటే, చూసి ఆనందిద్దామని వచ్చాను."

"అది పైశాచిక ఆనందం...!"

"కాదు... పేరున్న రచయిత నన్న అహంతో ఎన్నెన్నో కొత్త కొత్త హింసల్ని సృష్టించి, అత్తింటి వాళ్లతో ప్రయోగించి, నా చావుకి కారణమయ్యారే... మీరే శాడిస్టులు... మీదే పైశాచిక ఆనందం...!'

"కల్పనా..?!" గట్టిగా అరిచాను.

"మీరిప్పుడు నన్నేం చేయలేరు. ఎందుకంటే నేనిప్పుడు ఆత్మని మీ క్రియేటివిటీ నుంచి పుట్టుకొచ్చే హింసల్ని భరించడానికి నాకు భౌతిక శరీరం లేదు...!' మళ్లీ నవ్వింది.

"డోంట్ లాఫ్...!

"లేదు.. నవ్వుతాను.. పగలబడి నవ్వుతాను. పైశాచికంగా నవ్వుతాను. ఆంక్షలు విధించడానికి నా మీద మీకే హక్కూ ఆజమాయిషీ లేదు...!" "ఇంతకీ... నువ్విప్పుడు ఎందుకొచ్చావ్...?!

"మిమ్మల్ని హెచ్చరించడానికి...!"

"నాకు హెచ్చరికా...?!

"అవును. భర్తా, అత్తమామలకి తెలియనీ, ఊహకందని దారుణమైన హింసల్ని మీ కథల్లో సృష్టించి, తద్వారా మాలాంటి పాత్రల్ని బలితీసుకోవటం ఎంతవరకు సమంజసం ?! నైతిక విలువలు కాపాడాల్సిన రచయిత ఇలా చేయడం అనైతికం కాదా...?! ఇలా రాయడం అన్యాయం కాదా?! అమానుషం కాదా...? ఇలాంటి హింసల్ని కథల్లోని పాత్రలే భరించాలా...?! బలవ్వాలా...?! అదే మీ కూతురు దగ్గర కొచ్చేసరికి ఎందుకింత భయం...? బాధ...?! పాత్రకోన్యాయం..?! కడుపాత్రానికో న్యాయమా...?! చెప్పండి సార్...?!" అని ఆవేదన, ఆక్రోషం కలగలిపి అంది.

నా మెదడు మొద్దుబారిపోతోంది. ఆమె సంధిస్తోన్న ప్రశ్నలు శరాల్లా నా హృదయాన్ని చీలుస్తున్నాయి. "నేను పాత్రనే కావొచ్చు. మీరు సృష్టించిన అభూత 'కల్పన'నే కావొచ్చు. కానీ మీ కల్పనలోంచి రూపుదిద్దుకున్న హింసలు, నిజ జీవితంలో నాలాంటి ఎంతో మంది ఆడపిల్లల బతుకులను బుగ్గిపాలు చేస్తున్నాయి. భర్త, అత్త, ఆడపడుచులకు మీ కథలు హింసించడంలో కొత్త మెళకువలు నేర్పిస్తున్నాయి. వద్దు సార్.. మీ గొప్పల కోసం, మీ ఆధిపత్యం కోసం హింసని ప్రేరేపించే కథల్ని, రాయకండి... దయచేసి ఆడపిల్లల్ని చంపకండి... అయినా రాస్తానంటే అందులో మీ ముద్దుల కూతురు 'వాణి' కూడా ఉంటుందని గుర్తుంచుకోండి...!" అని హెచ్చరించి అదృశ్యమైంది కల్పన. ఒక్కసారి ఉలిక్కిపడి లేచి కూర్చున్నాను. చుట్టూ చూశాను. ఎవరూ లేరు. నిజమే.. నేను తప్పు రాస్తున్నాను. తప్పుచేస్తున్నాను. కలలో కొచ్చిన కల్పన నా కళ్లు తెరిపించింది. రచయితననే అహంతో, నాకున్నంత క్రియేటివిటీ ఎవరికీలేదని విర్రవీగుతూ, హింసని ప్రేరేపించే కథల్ని రాయడం ఎంత తప్పో తెలిసొచ్చింది.... తెలివొచ్చింది.

అవును జీవితంలోంచే కథలు పుట్టుకొస్తాయి. కథలు జీవితాన్ని ప్రభావితం చేస్తాయి. మంచి కథ సమాజహితం కోరితే, చెడుది సమాజ వినాశనానికి పాల్పడుతుంది. అందుకే క్రియేటివిటీ ఉంది కదానీ నైతికతనీ, సామాజిక స్పృహనీ విస్మరించి హింసని ప్రేరేపించే కథలు, దొంగతనాలు, హత్యలు, మానభంగాలు ఎలా చేయాలో, తెలివిగా అందులోంచి ఎలా బయటపడాలో నేర్పించే కథలు, కొత్త టెక్నిక్కులతో కోడళ్ని, చంపే కథలు రాస్తే ఏమౌతుంది?! దానివల్ల మంచి పెరుగుతుందా?! మానవత్వం పరిమళిస్తుందా...,.?! ప్రయోజనం చేకూరుతుందా?!

లేదు...లేదు...లేదు... మరి అలాంటప్పుడు అలాంటి హింసాత్మక కథలు రాయడం అన్యాయం... అనైతికం... అమానుషం... కల్పన నా కథలోని పాత్రే అయినా తన ఉపదేశంతో నా కళ్లు తెరిపించింది. అక్షరాల సాక్షిగా చెప్తున్నాను. ఇక అలాంటి హింసాత్మక కథలు రాయను ఆడపిల్లల ఉసురుపోసుకోను.







## మార్చి నెల పురస్కారాలు

**అమ్మా! నన్నూ ప్రేమించవూ!**

**కథకు........రూ.700/-**

రచయిత : **ఎస్. జగదీశ్వరి**

**పేపర్ బాయ్**

**కవితకు.......రూ.500/-**

రచయిత : **ఎ.ఎ. నాగేంద్ర**

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**
మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

---

# ఒకానొక నేపథ్యం

అడిగోపుల వెంకటరత్నం
9848252946

సాయంత్రానికి చీకటి నట్టింట కాపురం చేస్తుంది
చారెడు నూనె పోసి అమ్మవత్తి వెలిగిస్తుంది
చీకటిని కాల్చిన దీపం గర్వంగా వూగిపోతుంది
ఓటమి అంగీకరించని చీకటి
దీపస్తంభం కింద దాగి ఉనికి చాటుతుంది
పుస్తకం తెరిచిన చెల్లి పద్మాసనం వేసి కళ్ళుమూస్తుంది
వేమన పద్యాలు వరుసగా గళంలో నిలబడతాయి
సుమతి శతకం బట్టీ ప్రక్రియ ద్వితీయ అధ్యాయమౌతుంది
పద్యం మధ్యలో జ్ఞాపకం తెగిన కళ్ళు తెరుస్తాయి
చివరి మెట్టుదాకా వచ్చిన నా లెక్క నేలపై కాలు మోపదు
పరిభ్రమించిన మెదడు మళ్ళీ తరగతి గదికెళ్తుంది
సాఫీగా సాగిన సమీకరణం చివర సమమవ్వదు
సరళరేఖలో నడపటానికి జ్ఞానం పట్టాలపైకి లాగుతుంది !
నాన్న ఏదో వెతుకుతూ వుంటాడు
కనిపించాల్సింది కనిపించక కాలం గడుస్తుంది
దొరకాల్సింది దొరకక దోబూచులాడుతుంది
ఆశ నిరాశను కబళించాక అలసటవుండదు
కర్తవ్యం కాలాన్ని బంధిస్తుంది
స్వేదం శరీరం నుండి రాలి నేలపై విశ్రమిస్తుంది
నాన్న గవేషణ కొనసాగుతుంది !
అమ్మ వెలగని పొయ్యిలో తలపెట్టి వూదుతుంది
మండని కట్టెలు మండించే శక్తి అమ్మ వూపిరికే వుంది
ఊది ఊది ఊదరగొట్టం అలసిపోతుంది
అమ్మకు భయపడి అగ్నిదేవుడు ప్రత్యక్షమౌతాడు
ఉడికిన అన్నం భాగాలై మమ్మల్ని పిలుస్తుంది !
నాన్న వెతికింది దేనికోసం ఉదయాన అమ్మకు నా ప్రశ్న
ఏది వెతికినా మీ భవిష్యత్తు నాయనా అమ్మ జవాబు !



హరిష్ గంగబైరెయ్య
9505242567

### అమృత



ఫకీర్లంటుంటారు
కోరుకున్న తీరుగ బ్రతకడం
ఒక వింత అని
ఆ వింతని ఈమె
తన నైజముగా మార్చింది !
ఆమె కవితలా బ్రతికింది
తన బ్రతుకునే
కవితగా మార్చింది

### కవిత

ఒక సారి
ఒక కల బ్రతుకును అడిగింది
"నీవు ఎప్పటిదాకా కవిత్వాలు రాస్తుంటావు"
బ్రతుకు సమాధానమిచ్చింది
"ఎప్పటిదాక ప్రతి బతుకు కవిత కాదో
అప్పటిదాక."

### సెలయేరు

ఒక రోజు
నిలిచిన నీరు
ప్రవహిస్తున్న నీటిని అడిగింది
"నీవెప్పుడైనా ఆగావా?"
ప్రవహిస్తున్న నీరు అంది
"నేను ప్రవహించే నీరును
ఆగడం నా గుణం కాదు."

### తోడుగా

మనము
తోడుగా నడిచినప్పుడల్లా
దారులు మనకై పిలిచేవి
గమ్యాలు మనకొరకు వేచేవి !

## ప్రజా కవి



రాపోలు పరమేశ్వరరావు
9951416618

నీటిలోని చేపవోలె
తిరుగు జనం మధ్య
ప్రజలేగా సాహిత్యపు
కాలేజీ విద్య

జనులే నీ సందేశం
సమస్యలే సాహిత్యం
ప్రజల భాష యాసలన్ని
కవితలల్లుకో కవి

జనం ఘోష జగణాలై
బాధలన్ని భగణాలై
కన్నీళ్ళే యతులుగా
కవితలల్లుకో కవి

ఐక్యతొకటె ఆది ప్రాస
ఆశయమే అంత్యప్రాస
ఉద్యమముపమానముగా
కవితలల్లుకో కవి

సిద్ధాంతమే దుమువులు
చైతన్యమే గురులఘువులు
ప్రజలకు నువ్ పంతులుగా
కవితలల్లుకో కవి

సమాసమే మమతగా
శిల్పమే సమతగా
శ్రమరాజ్యం కావ్యంగా
కవితలల్లుకో కవి

## గజల్

బి. ఇందిర
9849173560



భూమి వంటి దామే అని అంటారా ఎవరైనా
భరించేది ఆమె అనీ అంటారా ఎవరైనా

తలను వంచుకుంటుందని అనుకుంటారేగానీ
నింగితోనె పోలికనీ అంటారా ఎవరైనా

అల్పమైన సంతోషం ఆమెదనీ అంటారే
నిండు మనసుకది గురుతని అంటారా ఎవరైనా

సహనశీలి సీత అనీ పొగుడుతారు సరేగాని
ధీరవనిత ఆమే అని అంటారా ఎవరైనా

ఇంటిలోన దీపమనీ మంగళహారతులె గాని
చీకటిలో వెలిగేనని అంటారా ఎవరైనా

కన్నీరే ఆయుధమని ఎగతాళికి ఏమిగాని
కర్మయోగి ఆమె అనీ అంటారా ఎవరైనా

అందాలకు- చందాలకు నిలువుటద్దమంటారే
కరిగిపోవు గంధమనీ అంటారా ఎవరైనా

మనుసులోతు తెలియదనీ మాటలెక్కుపెడతారె
మరిగిపోవు సంద్రమనీ అంటారా ఎవరైనా

మగాడిలా బ్రతికిందని కితాబులే ఓ 'ఇందిర'
మనిషిలాగ బ్రతికిందని అంటారా ఎవరైనా

# కట్టమంచి - రాళ్ళపల్లి

- సి. లలిత
9440744509



రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ
23.01.1893 - 11.03.1979

**కట్టమంచి, రాళ్ళపల్లి ఇద్దరూ గొప్ప విద్యాంసులు, వాళ్ళ మధ్య గురుశిష్య సంబంధముంది. పరస్పరం గౌరవించుకున్నారు. అయినా వాళ్ళ మౌలిక భావజాలాలు, జీవిత విధానాలు వేరు వేరు. ఇద్దరూ కలిసి ఆధునిక తెలుగు సాహిత్య విమర్శను సుసంపన్నం చేశారు. వాళ్ళ మధ్య వ్యక్తిగత గౌరవం, అభిప్రాయ వైవిధ్యం ఐక్యత ఘర్షణ సిద్ధాంతం లాగా కొనసాగాయి.**



కట్టమంచి రామలింగారెడ్డి
10.12.1880 - 24.02.1951

ఆధునిక తెలుగు సాహిత్య చరిత్రలో రచయితలుగా, విమర్శకులుగా ఉంటూ స్నేహాలతో, శత్రుత్వాలతో ప్రవర్తిస్తూ సాహిత్య సేవ చేసినవాళ్ళు ఎందరో ఉన్నారు. తిరుపతి వేంకట కవులు, శ్రీనివాస సోదరులు, వేంకట పార్వతీశ్వర కవులు వంటి జంట కవులు బాగా ప్రసిద్ధులు. విశ్వనాథ పింగళి సమకాలిక సాహిత్య సేవకులుగా ఉంటూ, ఇద్దరూ సంప్రదాయవాదులైనా, రెండు భిన్న మార్గాలలో ప్రయాణించారు. విశ్వనాథ శ్రీశ్రీలు విరుద్ధ మార్గానుయాయులు, చలం శ్రీపాదలు ఇద్దరూ సంస్కరణవాద రచయితలైనా వాళ్ళ మార్గాలు వేరు వేరు. ఈ కోవలో చేరే వారే కట్టమంచి, రాళ్ళపల్లి ఇద్దరూ గొప్ప విద్యాంసులు, వాళ్ళ మధ్య గురుశిష్య సంబంధముంది. పరస్పరం గౌరవించుకున్నారు. అయినా వాళ్ళ మౌలిక భావజాలాలు, జీవిత విధానాలు వేరు వేరు. ఇద్దరు కలిసి ఆధునిక తెలుగు సాహిత్య విమర్శను సుసంపన్నం చేశారు. వాళ్ళ మధ్య వ్యక్తిగత గౌరవం, అభిప్రాయ వైవిధ్యం ఐక్యత ఘర్షణ సిద్ధాంతం లాగా కొనసాగాయి. ఆ సంబంధాల్ని అర్థం చేసుకుందాం.

కట్టమంచి రామలింగారెడ్డి, రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మకు 1910వ సంవత్సరంలో తన వియ్యంకుడు కందాళి రఘునాథా చార్యుల ద్వారా మొట్టమొదటిసారిగా పరిచయమయ్యారు. వీరి పరిచయాన్ని గురించి 'నాగురువులు' అనే వ్యాసంలో రాళ్ళపల్లి ఇలా చెప్పుకున్నారు. "పాత ప్రపంచముననే ప్రాకులాడుతున్న నాకు వారితోడి సహవాసము ఆధునిక ప్రపంచపు తలుపులు తెరచి ఆహ్వానించినది" ఇది రాళ్ళపల్లి మీద పడిన కట్టమంచి ప్రభావాన్ని తెలియచేస్తుంది.

అప్పటికి రాళ్ళపల్లికి 17 సంవత్సరాలు. కట్టమంచికి 30 సంవత్సరాల వయసు. రాళ్ళపల్లి విద్యార్థి కాగా కట్టమంచి ప్రతిభ, లోకజ్ఞానం అనుభవం, అధికారం, ఆత్మప్రత్యయంలో రాళ్లపల్లి కంటే ముందున్నాడు. ఒక్క సంస్కృత భాష పరిజ్ఞానంలో తప్ప.

రాళ్ళపల్లికి తెలుగుభాషతో పరిచయం తక్కువ. అచ్చ తెలుగు రామాయణం, నీలాసుందరి పరిణయం, ఆంధ్రనామ సంగ్రహాలను బాల్యంలో తన తండ్రి కర్నమడకల కృష్ణమాచార్యులవద్ద చదివిందే. "నా తండ్రిగారుపదేశించిన ఆయింత తెలుగు కూడ మలినమై మాసిపోయియుండును. ఆ సమయమున దానికుత్తేజము గలిగించి ఉద్ధరించిన పుణ్యము శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి గారిది అని కట్టమంచి నుండి తాను పొందిన మేలును కీర్తించాడు రాళ్ళపల్లి.

ఈ తెలుగు భాషను కూడా తన కోసం కాక కట్టమంచి కోసమే నేర్చుకున్నానని కూడా చెప్పుకున్నాడు రాళ్లపల్లి.... మా సంబంధము దినదినమును పెరుగుచువచ్చినది. వారిని చూడలేని దినము దుర్దినముగా తోచినది సాయంకాలము ఏ రెండు మూడు గంటలు కాలమైనను మేమిద్దరమును కూర్చొని కాలక్షేపము చేయనిదినములు వారములో చాలా తక్కువ. తెలుగు కావ్యములు, ముఖ్యముగా కవిత్రయ రచనలు చదువుకొనుట, దానిపై లోకాభిరామాయణముగా ఎన్నో విషయాలు వారు చెప్పట, నాతో చెప్పించుట ఇది మా గోష్ఠికి పరాయణము. వారి వినోదము కొరకే నేను తెలుగు కవిత్వమునకు శ్రీకారము చుట్టితిని." అని తెలుగు భాషపై తనకు పరిచయం కలగడానికి కూడా కట్టమంచి సహకరించాడని చెప్పారు.

రాళ్ళపల్లి మొట్టమొదటి తెలుగు రచనా వ్యాసాంగం

వేంకటాధ్వరి సంస్కృతంలో రాసిన "సుభాషిత కౌస్తుభము"లోని నూరు పద్యాల అనువాదంతో మొదలైంది. ఇది తనకు నచ్చక చించేశారనే అభిప్రాయం కూడా ఉంది. అలాగే 1912లో దానిని వనపర్తిలో ముద్రించారనే అభిప్రాయం కూడా ఉంది అది నేడు అలభ్యం.

వీరి మొట్టమొదటి తెలుగు సృజనాత్మక రచన "భార్గవీ శతకం". ఇది 26 పద్యాలతో అసంపూర్ణం. వీరి సంపూర్ణ రచనలు తన 18,19 సంవత్సరాల వయస్సులో రాసిన "తారాదేవి" (1911) 'మీరాబాయి' (1912) అనే ఖండకావ్యాలు. ఈ రెండింటిని కట్టమంచికి వినిపించి వారి ప్రశంసలు పొందారు. ఈ రెండు కావ్యాలను ముద్రించింది కట్టమంచే.

1912లో కాళిదాసు రఘువంశాన్ని అనువదించారు రాళ్ళపల్లి. దీని ప్రచురణకు కట్టమంచి ధన సహాయం చేయడానికి ముందుకు వచ్చినా తనకే నచ్చక ప్రచురించలేదు. భాసుని 'స్వప్నవాసవదత్త'ను కూడా అనువదించి నచ్చక చించేశాడు.

రాళ్ళపల్లి ప్రతిభను గుర్తించి ఎలాంటి ప్రభుత్వ పరీక్షలలో అర్హతపొందని రాళ్ళపల్లిని మైసూరు మహా రాజా కాలేజిలో మొట్టమొదటి తెలుగు పండితునిగా 1912 జూలై 2న కట్టమంచి నియమించాడు.

కట్టమంచి రామలింగారెడ్డి రాసిన "కవిత్వతత్త్వ విచారము", "అర్థశాస్త్రము" అనే రెండింటికి శుద్ధ ప్రతులను తయారు చేసింది రాళ్లపల్లి వారే. ఈ రెండింటిలోను కట్టమంచి రాళ్లపల్లి అభిప్రాయాలను చేర్చారు. "కవిత్వతత్త్వ విచారముపై "అలంకారతత్త్వ విచారము" అనే విమర్శన గ్రంథాన్ని రాసిన కురుగంటి సీతారామయ్య "కవిత్వతత్త్వ విచారము" రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ రాసిందే అనే వాదాన్ని తెచ్చినప్పుడు ఆ రచన కట్టమంచిదే అని సవినయంగా చెప్పుకున్నాడు రాళ్ళపల్లి.

రాళ్ళపల్లికి సంగీతంలో కూడా ప్రవేశం ఉంది. వారి మొట్టమొదటి సంగీత వ్యాసమైన "గానకళ" అనే వ్యాసాన్ని కట్టమంచి చాలా మెచ్చుకున్నారు.

కట్టమంచి తాను అభిమానించే కవులు ముగ్గురని తన మొదటి రచన 'ముసలమ్మ మరణము' కావ్యానికి రాసుకున్న పీఠికలో చెప్పుకున్నారు.

"కవికుల బ్రహ్మదిక్కన గణనజేసి
సూరనార్యుని భావంబు సొంపుబొగడి
వేమన మహాత్ము సహజ. విద్యామయాత్మ
మొక్కి కవన మొనర్పంగ బూనినాడ"

కట్టమంచి, పింగళి సూరన రచనలైన కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నముల మీద "కవితత్త్వ విచారము' అనే విమర్శగ్రంథం రాశారు. ఇందులో కూడా తిక్కన, వేమనలను ప్రస్తావించాడు.

రాళ్ళపల్లి తిక్కన మీద "తిక్కన తీర్చిన సీతమ్మ" అనే వ్యాసాన్ని రాశాడు. "తిక్కనపై అభిమానానికి ఆయనే కారణం" అన్నారు. కట్టమంచి ద్వారానే తిక్కన తనకు అభిమానని రాళ్ళపల్లి చెప్పుకున్నట్లైంది.

వేమనపై కట్టమంచి 1928లో ఏడు రోజులపాటు ఏడు ఉపన్యాసాలు ఇప్పించదలచినప్పుడు దానికి అర్హుడుగా రాళ్లపల్లి తన మనసులో మెదిలాడు. దానికి కారణం 1917 వావిళ్ళవారు ప్రచురించిన "వేమన పద్యా"లకు రాళ్లపల్లి పీఠిక రాసి కట్టమంచి మన్ననలను పొందడమే.

ఈ ఉపన్యాసం ఇవ్వడానికి దరఖాస్తు చేసుకోడానికి 1928 'ఆంధ్ర పత్రిక'లో ప్రకటన వచ్చినప్పుడు సి.ఆర్. నరసింహశాస్త్రి ద్వారా రాళ్ళపల్లికి తెలిసినా దరఖాస్తు చేయలేదు. ప్రకటన వచ్చి ఇరవై రోజులైనా రాళ్లపల్లి నుంచి దరఖాస్తు రాకపోవడంతో కట్టమంచి "Why don't you apply for our vemana special lecuture ship?" అని ఉత్తరం రాశారు. కట్టమంచి మాటకు విలువనిస్తూ దరఖాస్తు చేసుకున్నాడు. ఉపన్యాసానికి సంబంధించిన సలహాలు, సూచనలు చేసి ఉపన్యసించడానికి రాళ్ళపల్లిని ప్రోత్సహించాడు.

రాళ్లపల్లి తన "మీరాబాయి" ఖండకావ్యాన్నీ, కట్టమంచి రామలింగారెడ్డి "ముసలమ్మ మరణము" ఖండ కావ్యాన్నీ నాయిక మరణంతోనే ముగించారు.

కట్టమంచి భారత కావ్యపాత్ర ద్రౌపదిని, రామాయణ పాత్ర సీతను తీసుకుని "ద్రౌపది-సీత" అనే వ్యాసాన్ని రాశాడు. రాళ్లపల్లి తెనాలి రామకృష్ణుని 'పాండు రంగ మహత్యము' లోని నిగమశర్మ అక్కపాత్రను తీసుకొని ఆ పేరుతోనే వ్యాసం రాశాడు. అలాగే వాల్మీకి రామాయణాన్ని తెలుగులోనికి అనువదించిన తిక్కన సీత పాత్రను తీర్చిదిద్దిన విధానాన్ని గురించి "తిక్కన తీర్చిన సీతమ్మ" అనే వ్యాసాన్ని రాశారు.

కట్టమంచి రామలింగారెడ్డి "కవిత్వతత్త్వ విచారము" శుద్ధ ప్రతి తయారు చేయడంలో రాళ్ళపల్లి తానే బాధ్యతలు నిర్వహించారు. అయినా అందులో తనకు నచ్చని విషయాలను నిర్మొహమాటంగా రాళ్ళపల్లి తన రచనలలో తెలియచేశారు.

"శిల్పము యొక్క అభిమతము సుఖము" అనే కట్టమంచి అభిప్రాయంతో రాళ్ళపల్లి ఏకీభవించడు.

"ఆనందమనగా సుఖముగాదు. సుఖము ఇంద్రియములకు సంబంధించినది. ఆనందము ఆధ్యాత్మికము. అనగా ఆత్మకెక్కువగా సంబంధించినది.... సుఖము ఆనందము యొక్క మిత స్వరూపము. చంచలము సుఖమే దుఃఖమునూ... ఆనందమట్టిది కాదు;... ఆమేయము". అని సుఖం ఇంద్రియాలకు సంబంధించినదన్నాడు.

వేమనపై కట్టమంచి రాళ్లపల్లితో చేయించిన ఉపన్యాసంలో కూడా తన వ్యక్తిగత అభిప్రాయాన్ని చెప్పాడు. వేమన రాయలసీమ రెడ్డి అనే కట్టమంచి అభిప్రాయాన్ని అంగీకరించలేదు.

రంగనాథ రామాయణ కర్తృత్వ విషయంపై కట్టమంచి చూపిన

# ఉమరుక్స్....

పటూరి నాగేంద్రరావు
7416665323

తోటలో తొంభైవేల పూలుపూచినా
ముళ్ళనే తిడుతూ కూచుంటావేం ?
పుండు మీదే మందు రాయాలి మిత్రమా !
చిరునవ్వుపై మలాము అంత అవసరమా ?

రైతన్నల ఆత్మహత్యలు
చేనేతల ఆకలి చావులు
బొబ్బలెక్కిన బాలకార్మికుల చిట్టి చేతులు
పూటగడవని పేద బ్రతుకులే ధీర్ఘాయుష్మాన్ !
బాబూ! జోర్ సే బోలో మేరాభారత్ మహాన్ !

పూలలా పరిమళించవు గులాబీముళ్ళు
తాటి చెట్టుకు కాయవు ఈతపళ్ళు
వజ్రపుకళ్ళున్నా చూడలేరు రాతి దేవుళ్ళు
అపకారికి అపకారమే ఫ్యాక్షనిష్టుబళ్ళు !

అంత్యోదయ, పనికి ఆహారం గ్రామీణరోజ్‌గార్
ప్రధాని ఆవాస్ యోజన, పేదరిక నిర్మూలన
పథకాలు ఏడంతస్తుల కొండైనా
గొంగలిని వెతుకు తారేం వేసినచోటే వుంటే !
పెట్రో నిప్పుల, గ్యాస్ గాలి వూసు
మేఘమథనం అంతా నీటిపాలు
వాగ్ధానాలతో మొలకెత్తదు నేల
అరచేతి వైకుంఠం అంతాశూన్యం !




---

ఉదాహరణలన్నిటికీ సమాధానాలు చూపించారు. కట్టమంచి గోనబుద్ధారెడ్డి కర్త అంటే రాళ్ళపల్లి రంగనాథుడని చెప్పాడు. "వారి శక్తి యుక్తులను గౌరవించినంత హార్థముగా వారి అభిప్రాయములను అంగీకరించుట నా వంటి వారికి పలుమాఱుగల్గు భాగ్యముగాదు" అని తన శక్తి యుక్తులపట్ల అభిమానం ఉన్నా వారి అభిప్రాయాలను అభిమానించనంటూ చెప్పాడు.

ఈ వ్యాసాన్ని చదివిన రామలింగారెడ్డి మూడు రోజులు ధమదుమలాడిరట ! అప్పుడు వీరిద్దరికీ సన్నిహితులైన అబ్బూరి రామకృష్ణారావు కట్టమంచితో "మీ శిష్యుడు ఇంత ధైర్యముగా మీ సిద్ధాంతములను ఖండిచుచున్నప్పుడు మీరు గర్వపడవలెను కాని గోపగించుట ఎందుకండి ? అని అన్నారట ! అప్పుడు రెడ్డి గారు శాంతించారట !

కొంతకాలానికి రాళ్ళపల్లి కట్టమంచిని కలిసినప్పుడు యోగక్షేమాల తర్వాత నవ్వుతూ "మీ విమర్శకులు మమ్ములను బతకనిస్తారేమయా?" అంటూ రాళ్ళపల్లితో కట్టమంచి అన్నారట.

సాహిత్యపరంగానే కాక నిజజీవితంలో కూడా వీరి అభిప్రాయాలు కలవవు. "నాది సనాతన సంప్రదాయం. ఆయనది ఆధునికంలో ఆధునికం" "నీవు కూడా పెండ్లి చేసుకొని భార్య బంధంలో చిక్కుకొని స్వరూపనాశనం చేసుకోవద్దయా !' అని రాళ్ళపల్లికి ఉపదేశించాడు. 'మీ ఉపదేశం కాలాతీతంగా వచ్చింది. మరి మీకున్న భయమూ నాకు లేదు." అని రాళ్ళపల్లి బదులిచ్చాడు.

మరోసారి "రామునికి సీత చెల్లెలు గాని భార్య కాదు" అని రాళ్లపల్లి కట్టమంచితో అనగా అప్పుడు "అందులో ఆశ్చర్యమేమి లేదు. చెల్లెలే భార్యగా వ్యవహరించి వుండవచ్చును." అని కట్టమంచి అన్నారట. అంటే అలాంటి వివాహాల గురించి మరియు అన్య రక్తంవారు తమ రాజ్యాన్ని ఏలకూడదనే ఉద్దేశంతో కూతురునే వివాహం ఆడేవారని కట్టమంచి చెప్పేనట. "ఆ మాట నాకెంత హృదయ భేదకంగా వుండిందో చెప్పి చూపలేను" అని చెప్పుకున్నాడు రాళ్ళపల్లి.

ఇలా చాలా విషయాలలో కట్టమంచి అభిప్రాయంతో రాళ్ళపల్లి అభిప్రాయాలకు పొంతన లేక పోయినప్పటికీ కట్టమంచి శక్తియుక్తులపట్ల మాత్రం రాళ్ళపల్లికి అమితమైన అభిమానం.

"గాథాసప్తశతిసారము" అనే గ్రంథాన్ని కట్టమంచికి అంకితమిస్తూ రాసిన పద్యాలే అందుకు నిదర్శనం వాటిలో ఒకటి -

"నీదు నగవు బిగువు, నెఱపల్కుపదును, నీ
తెలివిలోతు, నడతతెగువ, నీదు
నిండు తెలుగుమనసు, నీయోర్మి నీకూర్మి
మచ్చు మందులగుచు మరిపెనను"

ఇలా కట్టమంచితో రాళ్లపల్లికి 1910లో పరిచయమై 1950 వరకు అంటే కట్టమంచి మరణం వరకు కొనసాగింది. కట్టమంచి చే నియమించబడిన మైసూరు మహారాజ కాలేజిలో రాళ్ళపల్లి తెలుగు పండిత పదవిలో 1912 జులై 3వ తేది నుంచి 1949 డిసెంబరు 19 వరకు ఉండి పదవి విరమణ చేశారు.



# జల సత్యాగ్రహం

ఉదయ మిత్ర
9985203376

నీళ్లల్లో
నిప్పులు పుట్టించడమంటే ఇదేనేమో...
గవ్వలో
సముద్రపుహోరును విన్పించడమంటే ఇదేనేమో

చరిత్రలేని మనుష్యులు
చరిత్రను సృష్టించారు
సామాన్యులు
సంకల్పబలంతో అసామాన్యులుగ ఎదిగారు...

నేల మీద నడిచిన ఉద్యమం
కాళ్లకింద నేలను సైతం గుంజేయడంతో
నీళ్లలోకి ప్రవేశించింది
ఉద్యమం కొత్తపుంతలు దొక్కింది....

గొంతులోతు నీటిలో నిలబడి
స్థలకాలాల, వయసు భారాల లెక్కజేయక
చలికీ, సర్కారు పులికీ భయపడక
వాళ్లు... జల సత్యాగ్రహంలో
చరిత్రను జలదరింపజేశారు...

నీళ్లలో నిప్పులు చిమ్మిన ఉద్యమం
కాలం మీద కాంతులు జిమ్మింది
హద్దులు చెరిపిన త్యాగం
శిఖరాల్ని తాకింది...

* *

ఒకటా.. రెండా.. పదిహేడు రోజులు
నిశ్చల నిశ్చయంలో నీళ్లలో నివాసం
ఒళ్లు గగుర్పొడిచే సాహసం
కొండను ఢీ కొట్టే సమరోత్సాహం
"హమ్ లడేంగే - హమ్‌జీతేంగే"

"సర్కార్ ఆయే - దర్బార్ ఆయే
హమారే జమీన్ లేకె రహెంగే"

"హోష్‌మే ఆవో సర్కార్ - హోష్‌మే ఆవో"
నీళ్లలో నిలబడి నినాదాలిస్తోంటే

జలకళ ఉద్యమ కళను సంతరించుకొంది
భూమి పులకించింది
ఆకాశం వొంగి ఆశీర్వదించింది
గాలి తాకిడికి
నెమ్మదిగ ఊగే తరంగాలు



మంద్ర స్వరంలో మద్దతు తెలిపాయి
కప్పలు బెకబెకల్తో స్వాగతం పలికాయి
నింగితారలు దిగివొచ్చి
జలతారల చేయిగలిపి
ఆనంద తాండవ మాడాయి

సమస్త జలచరాలు సభలు బెట్టి
అభినందనల మందారమాలలల్లాయి...

* *

కళ్లు - కాంతి శిఖరాలు
శరీరాలు - ఉద్యమసోపానాలు...
చెడినపాదాలు, చెడిన అరచేతులు
భరించలేని బాధల్ని
బిగబట్టిన దృఢసంకేతాలు...
సర్కారు గుండెమీద
ఈడ్చి తన్నిన ధిక్కార సంకేతాలు...
ఒక్క ఫ్రేములో
అనంత బాధల్ని పల్కించే చిత్ర ప్రసాద్ బొమ్మలు

బతుకు యుద్ధంలో
నీటి ఆయుధం..
సరికొత్త ప్రయోగం
చదువేరాని వాళ్లు

చరిత్రలో చదవాల్సిన కావ్యమయ్యారు
జీవితంలో గడించిన
అనుభవసారాల్నే కేకలుగ విసిరి
పతాక శీర్షికలయ్యారు..

* *

బక్క చిక్కిన మట్టి మనుష్యులకు
లోకమంతా "ఫిదా" అయ్యింది.

సంభ్రమాశ్చర్యాలతో లోకం చూస్తుంటే
నిశ్చల నిశ్చయంలో హక్కుల్ని సాధించి
షార్క్‌ల్తో యుద్ధం జేసి
తీరాల్ని వెల్గించిన "షాంటియాగో" లాగ
భూమ్మీద అడుగు పెట్టారు.

నీళ్లలో నిప్పులో రాజేసి
సర్కారు గుండెల్లో సునామీ సృష్టించి
ఉద్యమాల సరిహద్దుల్లో
కొత్త పొద్దయిలేచారు...

కథ

# ఆ రెండు గంటలూ...




జంధ్యాల రఘుబాబు
9849753298

**స్నేహం నిజంగా విచిత్రమైంది. అది కుదిరిందంటే ఇక స్నేహితులు లేనిది ఏ పనీ చేయలేం. సినిమాకైనా సరే పక్కన మనసు విప్పి మాట్లాడుకునేవారుండాల్సిందే. చెప్పాలంటే నాకూ, శారదకూ గత అయిదేళ్ళుగానే పరిచయం. అయినా సరే ఒకటవ తరగతి నుండి కలసి ఉన్నంత దగ్గరగా ఉంటాము. ఏదైనా శుభ కార్యం జరిగిందంటే మొదట తననే పిలుస్తాను. ముందు నుండీ ఉన్న మిత్రులు కూడా ఆమె తరువాతే. లత అంటూనే ఉంటుంది ముందొచ్చినచెవుల కంటే వెనకొచ్చినకొమ్ములే గట్టివని! ఎవరేమనుకున్నా నేను తనతో చాలా క్లోజ్.**

మా ఇంట్లో ఒక మానసిక శాస్త్రవేత్త ఉండనే ఉన్నాడు. ఆయనే మా ఆయన కుమార్. ఓ పావుగంట చరవాణిలో మాట్లాడితే చాలు "స్నేహబంధమూ ఎంత మధురమూ చెరిగిపోదు కరిగిపోదు జీవితాంతమూ" అని పాడుతుంటాడు. తనే టీ పెట్టుకుంటాడు. ఇంకా కొనసాగితే వంట మొదలెడతాడు కూడా. నేనొచ్చి చేస్తాను కదా అంటే "నీవూ ఆ శారద గారు ఒకే తరంగ దైర్ఘ్యం అంటే సమానమైన కొలతలు గల తరంగాలు కలిగి ఉన్నారు, మెదడులో అన్నమాట. అందుకే నా పని నేను చేసుకుంటాను" అంటుంటాడు. అలా అన్నప్పుడంతా నేను శారదకు ఇంకా దగ్గరైనట్టుగా ఉంటుంది. మా పిన్ని కూతురు షాలిని పెళ్ళి కుదిరింది. ఈ శారద ప్రవేశించకముందు వయసులో చిన్నదైనా షాలిని నాకు యమ క్లోజ్. పెళ్ళికి వారం రోజులు ముందే రావాలని చెప్పింది కూడా. ఈ రోజుల్లో వారం ఎవ్వరికీ కేటాయించలేకున్నా, పిలుచుకోవటం వరకైనా పాత కాలం మిగిలే ఉంది. ఒక్కోసారి అదే చాలనిపిస్తుంది నాకు. వారం కాకపోయినా రెండురోజులైనా సరే ముందుగా వెళ్ళాలి. తనకు మంచి చీర కూడా కొనాలని కుమార్‌తో చెప్పాను.

ఫిబ్రవరి 21. పెళ్ళి ఇక పదిరోజులే వుంది. ఈరోజు కచ్చితంగా షాపింగ్ చేయాలి. దిల్‌షుక్ నగర్లోని ఓసేటు దుకాణంలో బట్టలు తీసుకోవటం అలవాటయింది ఈ మధ్య. నాణ్యతతో పాటు ధర కూడా కచ్చితంగా ఉంటుంది. మామూలుగానే శారదకు ఫోన్ చేశాను. మలక్‌పేట యశోదా దగ్గర తన ఇల్లు. రోడ్డుపైన వేచి ఉండమన్నాను. సాయంత్రం అయిదున్నర గంటలకు నేను ఆటో ఎక్కి పదినిముషాల్లో

తన దగ్గర ఉన్నాను. తను ఆలో ఎక్కి దుకాణానికి వెళ్ళేసరికి ఆరు. ఆ ఇరవై నిముషాల్లో ఎన్నో మాటలు.

సేటు సాదరంగా ఆహ్వానించాడు. కొత్త స్టాకు వచ్చిందని చూపిస్తున్నాడు. షాపులోని అబ్బాయి. తెల్లటి చీరపైన అటు అరెంజ్‌కూ ఎరుపుకూ రంగులో చిన్న చిన్న పూలున్న చీర "ఏది ఇటివ్వు" అని శారదా, నేనూ ఒకేసారి చేయి జాపాము. చీరలు చూపిస్తున్న అబ్బాయి ముసి ముసి నవ్వులు నవ్వాడు మా అరుపులు విని. మేమిద్దరం ఒకరిని ఒకరు చూసుకుని నవ్వుకున్నాము. అదే చీర ప్యాక్ చేయమన్నాను. ఎటూ సమయం మిగిలింది కదా అ కొత్తగా వచ్చిన చీరలు ఓ పావు గంట చూశాము.

అనుకోకుండా షాపింగు త్వరగా ముగియటంతో బయటపడ్డాము. "సరోజా నీవు ఆటోలో వెళ్ళిపో, ఎటూ ఇంత దూరమొచ్చాము కాబట్టి కూరగాయలేవైనా మార్కెట్లో తీసుకెళ్తాను" అంది. "నీదయ్యాకే పోదాములే" అన్నాను. "మాట వినవే, నాకు బస్సు కూడా వుంటుందిలే, మెట్రో ఎక్స్ప్రెస్ అయితే మూడు స్టాపులే. పిల్లలు బళ్ళ నుండి వస్తారు, నువ్వెళ్ళు" అని గదమాయించి తను వెళ్ళిపోయింది. తన పిల్లలు కొద్దిగా పెద్దవారు. కాలేజీకి వచ్చారు. మా పిల్లలు చిన్నవారని తన తపన. వారు కూడా అందుకే ఆంటీ ఆంటీ అని తన వెంటపడుతుంటారు.



అవీ ఇవీ ఆలోచించుకుంటూ ఆటో ఇంటి దగ్గరికొచ్చిందన్న విషయం కూడా గుర్తించలేదు. మీటర్ ప్రకారం డబ్బులిచ్చి దిగాను. వీధిలో, అపార్టుమెంటు దగ్గరా అందరూ చేరి మాట్లాడుకుంటున్నారు. ఏమిటని ఆరా తీస్తే నగరంలో బాంబు పేలుడు జరిగిందన్నారు. మొదట ఎక్కడ జరిగిందీ తెలియలేదు. మరో పదినిముషాలకు తెలిసింది. దిల్‌షుక్‌నగర్ లోనేనని. నా గుండె వేగంగా కొట్టుకోసాగింది. అయినా దిల్‌షుక్ నగర్ అనగానే కంగారెందుకు తనకు? శారద మార్కెట్ దగ్గరక్కదా వెళ్ళింది! బాంబు ఇంకెక్కడో పడి ఉండవచ్చు అనుకుంటూ శారద సెల్లుకు చేశాను. రింగ్ అయింది. హమ్మయ్య! అనుకున్నాను. సగం ధైర్యమొచ్చింది. రింగ్ అయ్యింది కాని ఎత్తటం లేదు. బహుశా బస్సు ఎక్కుతూ ఉంటుంది. మళ్ళీ తనే చేస్తుంది. మరో పదినిముషాలకు మరో పిడుగు లాంటి వార్త. ఇంకో బాంబు పేలిందని. మొదటిది మార్కెట్ దగ్గరే జరిగిందట. నా ప్రాణాలు పై పైనే పోయాయి. టీవీ పెట్టాను ఫ్లాష్ ఫ్లాష్ అని వేస్తున్నాడే కాని చిత్రాలు చూపటం లేదు. పదహారు మంది దాకా చనిపోయారనీ, ఇంకెతమందో గాయపడ్డారనీ వేస్తున్నాడు. నాకు కాళ్ళూ చేతులూ వణకటం మొదలయింది. వెంటనే కుమార్‌కు ఫోన్ చేశాను. "నువ్వేం భయపడకు, తనకేమీ అయ్యుండదు. కంగారులో ఫోన్ ఎత్తి వుండకపోవచ్చు, నేనొచ్చేస్తున్నాను. ఎందుకైనా మంచిది వాళ్ళాయనకు చెప్పు" అని పెట్టేశాడు. అదేపని చేశాను. తను దిల్‌షుక్ నగర్ వెళ్ళిందని కూడా చెప్పాను. ఆయనా కంగారుపడి మళ్లీ చేస్తానని పెట్టేశాడు.

నా పరిస్థితి పరమ దారుణంగా ఉంది. టీవీ చూడలేను, తనేమో ఫోన్ ఎత్తదు. రెండు గ్లాసుల నీళ్ళు తాగి మళ్ళీ ఫోన్ దగ్గరకు పోయాను. మేము షాపింగు చేసిన చీర కవర్ కనిపిస్తోంది. ఒక్కసారిగా ఏడుపొచ్చింది. అలాగే సోఫాలో పడిపోయాను. "అమ్మా, ఏమిటలా పడుకున్నావ్, టీవీ ఆన్ లోనే ఉంది. తలుపులు సరిగా వేయలేదు, ఏమైందమ్మా?" పిల్లలు లేపారు. ఈలోకంలోకొచ్చాను. వాళ్ళునన్నిలాంటి పరిస్థితిలో ఇదివరకెన్నడూ చూడలేదు. కుమార్ వచ్చి వుంటే బాగుండేది అనుకుంటూ సెల్లు అందుకున్నాను. రెండు మిస్సుడు కాల్సు. శారద భర్త నుండి. ఆయన పరిస్థితి మరీ ఘోరంగా ఉంది.

టీవీలో క్షతగాత్రులను ఏ ఏ ఆసుపత్రులకు తీసుకెళ్ళారో చూసి బయలుదేరబోయాను. ఎదురుగా కుమార్. నాకు ప్రాణం లేచొచ్చింది. ఇద్దరం బయలుదేరాము. నాకు ఏడుపు ఆగటమే లేదు. శారదనుఏ పరిస్థితుల్లో చూడవలసివస్తుందోనని భయం. ఈ ముస్లిం తీవ్రవాద సంస్థలనూ, ముస్లింలనూ అందరినీ తిట్టుకోసాగాను. హాయిగా ఉండే మనుషులకు ఇలాంటి నరకప్రాయమైన పరిస్థితులు ఎవరివల్ల వచ్చాయి అని ఆలోచనలు పోతున్నాయి. అసలు తీవ్రవాదులు ఎంతటి కర్కోటకులో, వారికి ఆశ్రయమిచ్చిన వారు కూడా అలాంటివారే. మనతో పాటు జీవిస్తూ మన ప్రాణాలకే ఎసరు తీసుకొచ్చే వారంటేనే నాకు అసహ్యం వేసింది. ఇక నుండి అలాంటి వారి మొహం కూడా చూడకూడదనుకున్నాను. పాత బస్తీలోని అందరి ఇళ్ళనూ ప్రభుత్వం సోదా చేయలేదా అని తిట్టుకున్నాను. ఎక్కడో ఎవడో మన దేశంలో కూర్చొని మనలాంటి దేశాల్లోని కొన్ని మతాలవారితో ఇవన్నీ చేయించటం నాకు చిత్రంగా తోచింది. మైనారిటీలంటేనే నాకు వొళ్ళు మండిపోయింది. అయితే కుమార్ చెబుతూ ఉంటాడు మైనారిటీ వారితో పాటు మెజారిటీ వారు కూడా ఈ ఉగ్రవాద చర్యలకు పాల్పడుతున్నారని. ఇది ఒకవైపు నుండి చూసే అంశం కాదని. ఒక ఆసుపత్రికి వెళ్ళాము. తన జాడ ఎక్కడా కనబడలేదు. శారద భర్త, కొడుకు కూడా కనిపించారు. ఇప్పటికి గంట, గంటన్నరా పరిస్థితిలో మార్పేమీ లేదు. అయిదు నిముషాల కొకసారి తనకు రింగ్ చేస్తూనే ఉన్నాను.

అనుకోకుండా ఈసారి శారద సెల్లు ఎత్తింది. "శారదా శారదా, ఎలా ఉన్నావ్ !" గట్టిగా అరిచాను. కుమార్ ఆత్రుతగా నా మొహం వైపు చూస్తున్నాడు. అవతల నుండి ఒక మొగ గొంతు. "మేం సాబ్ ఇదర్ ఏక్ ఔరత్ నీచే గిర్ గయాహై. ఫోన్ ఉస్కీ పాస్ హై. మార్కెట్ కే ఫీచే హాస్పతాల్‌మే..." పక్కనే ఉన్న చిన్నపాటి నర్సింగ్ హోంలో చేర్చినట్టు చెప్పాడు. మార్కెట్ వెనుకనున్న హాస్పిటల్ అది. "అక్కడే ఉండండి దయచేసి" అని మాత్రం అనగలిగాను. కుమార్‌కు ఎక్కడికి పోవాలో చెప్పాను. శారద వాళ్ళాయనకు సమాచారమిచ్చాను.

# వంచితధాత్రి

డా. వై. రామకృష్ణారావు
8985743964

ఈనేల
తరాలుగా మోసపోతూనే ఉంది
దీని ఉనికి, మనికి
ఎంత అనాది !
పుటల్లో ఇమడలేనంత
సంక్లిష్ట చరిత్రకు ఇది వేది
కాలగర్భంలో కలసిపోయినా,
వెలిసిపోయినా
ఎంతటి సుదీర్ఘ పురాతన గతానికైనా
ఎక్కడో ఓ మూల
చెకుముకిలో నిప్పును దాచినట్లు
ఏదో ఆనవాలును
దాచే ఉంచుతుందీనేల
తనదైన దేన్నీ వదులుకోలేని
అమ్మమనసు ఈ బేల నేలది
ఎడారిగాపడి ఉంటే
ఎండమావి మోసం చేస్తున్నది
పొలమై పండితే
తుఫానుదోచేస్తున్నది
మబ్బుతో ఎంత చెలిమి నేలకి !
సూర్యుడు హింసించి వదిలినపుడు
మబ్బు తొలకరితో పలకరిస్తే
పులకించి, పరిమళశ్వాసతో
స్వాగతం చెప్పడంలేదూ !
కానీ, మబ్బు కుండపోతై
గుండె చెరువు చేస్తుందా !
అయినా-
నేల నమ్ముతూనే ఉంది
కళ్ళు తడుచుకుని
నవ్వుతూనే ఉంది

-0-



ఆయన ఒకటే ధన్యవాదాలు, ఫోన్లోనే. దీనికంతటికీ కారణం నేనన్న సంగతి తెలియదాయనకు. బండి ఎక్కడో ఆపి ఫోన్లో అతను చెప్పిన స్థలానికొచ్చాము. నా గుండె ఝల్లుమంది. బాంబు పేలి మనుషులు చనిపోయిన ప్రదేశానికి ఒక్క ముప్పై అడుగుల దూరంలో ఉంది. బహుశా ఇక్కడే పడి ఉండవచ్చు అనుకున్నాను.

మళ్ళీ శారద సెల్లుకు ఫోన్ చేశాను. శ్రావణి నర్సింగ్ హోం అని చెప్పాడతను." కింద పడిపోయినావిడ బాంబు శబ్దానికి భయపడిపోయింది, తలపై ఏదో గాయమైంది. రెండు కుట్లు కూడా పడ్డాయి" అని చెప్పాడతను.

పరుగు పరుగున ఆ నర్శింగ్ హోం చేరుకున్నాము. రిసెప్షన్లో అడిగి లోపలికెళ్ళాం. రూం. బయట ఒక ముస్లిం వ్యక్తి, వయసు అరవై అయిదు వుండవచ్చు, చేతిలో శారద ఫోన్. ఆ ఫోన్ చేతిలోకి తీసుకుని ముద్దు పెట్టుకున్నాను. కళ్ళలో నుండి నీళ్ళు. "గబ్రానేకీ కొయీ బాత్ నహీ హై" అని అతను ఓదార్చాడు. ఇంతలో డాక్టరొచ్చాడు. కుమార్ డాక్టరుకు మేమెవరో చెప్పాడు. "పేలుడు శబ్దానికి మూర్ఛపోయారు, తలపైన ఏదో తగిలి గాయమైంది, కుట్లు వేశాను. నథింగ్ టు వర్రీ, పది నిముషాల్లో స్పృహ వస్తుంది" అని చెప్పి వెళ్ళిపోయాడు.

కిటికీలో నుండి చూశాను, శారదే, నా శారదే. అంతవరకూ ఎక్కడెక్కడో తిరుగుతున్న నా ఆలోచనలు సర్దుకుంటున్నాయి. కొద్దిగా ధైర్యమొచ్చింది. పది నిముషాలకు ఓ నర్సు బయటకొచ్చింది. లోపలకు పోవచ్చునని చెప్పింది. నాకు ధైర్యం చాలలేదు. శారద వాళ్ళాయనను తీసుకుని కుమారే లోపలికి వెళ్ళాడు. అయిదు నిముషాలకు నన్నూ రమ్మన్నాడు వెళ్ళాను. శారద మగతగా చూస్తోంది. నన్ను రమ్మంది. చిన్న స్వరంతో "నీకేం కాలేదు కదా" అంది. ఒక్కసారి తన మీద పడి వెక్కి వెక్కి ఏడ్చాను. తనే నన్ను ఓదార్చాల్సి వచ్చింది. ఓ చిన్న అపాయం జరిగినా దేవుడిని ప్రార్థించే నేను మొదటిసారి ఆ పని చేయలేదు. చేయటానికి సమయం కూడా చాలలేదు. అయితే బయట నిల్చున్న ముస్లిం వృద్ధుడే నాకాసమయాన దేవుడిలా కనిపించాడు. నాకు తెలియకుండానే ఆయన కాళ్ళకి దండం పెట్టాను.

అంతవరకూ నలుపూ తెలుపూలో ఉన్న విషయాలు తెల్లవి నల్లవిగా, నల్లవి తెల్లగా కనిపించసాగాయి. నేనెవరినైతే అనుమానించానో వారే ఎటువంటి సంబంధం లేని వారిని రక్షించటం నన్ను అబ్బురపరిచింది. బాంబు పేలుళ్ళలో మరణించిన, గాయపడ్డ వారిలో ఫలాన మతం అని లేకుండా అందరూ ఉన్నారు. ఎవరు ఎవరో తెలియకుండా అందరికీ అందరూ సహాయం చేయడం అన్ని ఆసుపత్రుల్లోనూ తను చూసింది. మతమేదో, కులమేదో తెలియకుండా ఎందరో రక్తమిచ్చారు. ఇంకా ఎన్నో విధాల సాయం చేసిన వారున్నారు. ఎవరి మతం వారికి వారి సహాయం చేరుతుందన్న ఊహ ఎవ్వరికీ లేదు. మనుషుల్ని అలా వేర్పరచి తమ పబ్బం గడుపుకునేవారి పట్ల అందరూ జాగ్రత్తగా ఉండాలని అప్పుడే తీర్మానించుకున్నాను. నిజంగా ఈ రెండు గంటలూ ఎన్నెన్నో మలుపులు తిరిగి ఇలా సుఖాంతమవ్వడం, నా మనసులో కట్టుకున్న ఆలోచనలు కొన్ని మారిపోవటం చూసుకుంటే నాకే ఆశ్చర్యంగా వుంది. నా శారద నాకు దక్కింది అది చాలు. ఇక పై ఇలాంటి గంటలు మా మధ్య రాకూడదు.



## ఎగిరిపోతున్న జ్ఞాపకం

సి.హెచ్.వి. బృందావనరావు
9963399189

ఎవరెవరు
ఎక్కడెక్కడున్నారో ఏమో
ఎవరు ఏ విహాయస వీధుల్లో
గువ్వలై ఎగుర్తున్నారో
ఎవరు ఏ ముళ్ళ కంచెల్లో
ఇరుక్కుని
ఎక్కిళ్ళ గుక్కెళ్ళౌతున్నారో !
బతుకులు ఎవరివి వారివైనాక
ఎవరెవరు ఎటెళ్ళిపోయ్యారో
అసలున్నారో లేదో !
రోజూ ఎవడో ఒకడు
జ్ఞాపకపు ముల్లై వచ్చి
గుచ్చుకుంటూనే వుంటాడు
మళ్ళీ ఓ సారి
నడక మొదలు పెట్టిందగ్గరికి పోయి
ఆ కంచెనూ, కాలవనూ
పిట్ట గూటినీ చూసిరావాలి
అవైనా అక్కడ లాగే
వున్నాయోలేదో
కనీసం అసలున్నాయో లేదో-
తీరా పోయింతర్వాత
ఏ పొద వెనకాల్నించో
ఓ ముసలిగొంతు పసికేరింతలై
వెనుకనించొచ్చి
హఠాత్తుగా భయపెట్టినట్టు నటించి
గలగలా నవ్వుతుందేమోనని
ఓ అసందర్భపు నమ్మకం -
ఓ గువ్వరాలిపోయిందనో
ఓ దీపం మలిగిపోయిందనో
ఏ ఆర్నెల్ల తర్వాత, ఏడాత్తర్వాతో
తెలుస్తుంది
పైనించి పడ్డ పిడుగులాకాక
కాళ్ళకిందికి నిశ్శబ్దంగా వచ్చిన వరద నీరులా
విశ్రాంతి లేని దుఃఖపు దుప్పటొకటి
పరుచుకొంటుంది మనసంతా-



నన్ను గురించిన వార్త గూడా అలాగే
ఎవరికోకరికి, ఎప్పుడొకప్పుడు
చేరుతుంది గామాల
పెరట్లోంచి ఇంట్లోకి దూరి
చిలక్కొయ్య మీద కూచుని లేచిపోయిన
సీతాకోకచిలుక లాగా
ఏ జ్ఞాపకం ఎప్పుడు ఎగిరిపోతుందో...

## సేద్యానికి మంచిరోజులు ఎప్పుడు

ఆకుల రఘురామయ్య
9581384016

అరచేతి గీతలు
అరిగిపోయే దాకా అరక తిప్పినా
ఓటమని తెలిసీ
చివరి వరకు పోరాడవలసిన కర్ణుడైనాడు
ఆరుగాలాలూ శ్రమించి
పుడమి తల్లిని సేవించినా
ఫలం అందనప్పుడు తల్లడిల్లేది
తానొక్కడి కోసమే కాదు
నమ్ముకున్న వాళ్లందరికీ ఇంత
బువ్వ పెట్టాలన్న అమ్మతనంతో...
దుర్భలమైన నేతల ఏలుబడిలో
అన్ని వైపులా కష్టాలే
ప్రతిసారీ కన్నెర్రచేసే
ప్రకృతిదీ అదే దారి
పుట్టబోయే బిడ్డ గర్భంలోనే మరణిస్తే
తల్లికెంత
గర్భశోకమో
పంట ఎండిన రైతుకంత కడుపుకోత
పాలు తాగే చంటి పిల్ల
నీట మునిగితే తల్లికెంత కడుపుకోతో
పంట మునిగిన రైతుకంత గుండె కోత
మట్టితో
సాగుబడి బంధం
పేగు ముడికన్నా బలమైనది
పంట చేతికి దక్కడమంటే
చంటి బిడ్డను
మీసకట్టుదాకా పెంచడం కన్నా కష్టం
శాస్త్ర విజ్ఞానం
ఎంత శరవేగంగా దూసుకుపోతున్నా
బతుకుబండి ముందుకు సాగాలంటే
సాగుదారుడు బతికి ఉండాల్సిందే
నిస్పృహ నైరాశ్యాలతో
హలధారి అస్త్ర సన్యాసం చేసి



అంపశయ్యను ఆశ్రయిస్తున్నా
ప్రభుత్వం శిఖండి పాత్రను రక్తి కట్టిస్తోంది
రైతు బాగే లక్ష్యంగా
ప్రభుత్వాల విధి విధానాలు
నిజాయితీగా పొలం బాట పట్టినప్పుడే
సేద్యానికి మంచి రోజులు.

కథ

# ప్రియబాంధవి

బి. కళాగోపాల్
9441631028



**"ఛ్ఛ్! మమ్మీ, మర్చిపోయావ్ ఈ రోజు బ్లాక్ రిబ్బన్లుకావు. వైట్‌రిబ్బన్లు వేయాలి" అంటూ అల్లుతున్న జడని సర్రని లాక్కొని గబగబా లోనికి వెళ్లబోతున్న పావనితో, మాలతి "అయ్యో! నా మతిమండా మర్చేపోయా ఈ రోజు శనివారం కదూ! తొందరగా పట్రా ఫో!" అంటూ కేకేసింది. స్కూల్‌కి టైమవుతోంది. ఎక్కడిపనులు అక్కడే ఉన్నాయి. ఇంకా లంచ్ బాక్సులు సర్దాలి. కుక్కర్లో పప్పు ఉడుకుతూ విజిల్స్ వచ్చేస్తున్నాయి. గోడపైని గడియారం నిశ్శబ్దంగా ఇంత సందట్లో తన పని తాను చేసుకుపోతున్నది. బారెడు పొద్దెక్కినా ఇంకా లేవని శ్రీవారు మోహన్ పుత్రరత్నం కృష్ణల నిద్రమత్తు వదల్చాలి. ఇంతలో పావని లోపల్నించి కేక "మమ్మీ! వైట్ రిబ్బన్లు ఎక్కడ పెట్టావ్ ! నా షెల్ఫ్‌లో కన్పించటం లేదు" అంటూ,**

మాలతి అసహనంగా "డ్రెస్సింగ్ టేబుల్ డ్రా లో చూడు" అంటూనే ముందుగా బాబు రూంలోకి నడిచింది. కప్పుకున్న దుప్పటిలాగి "స్కూల్‌కి టైమవుతుంటే ఇంకా నిద్రమబ్బు ఏమిటీ?" అంటూ హెచ్చరించి హాల్లోకి వచ్చింది. పావని జడల కార్యక్రమం పూర్తయ్యాక, కిచెన్‌లో మిగిలిన వంటపని పూర్తి కానిచ్చింది. ఇంతలో శ్రీవారి కేక "టిఫెన్ పెట్టోయ్ ఆకలి దంచేస్తుంది" అంటూ అందరి లంచ్ బాక్సులు సర్ది, టాటాలు చెప్పి ఒకింత అలసటతో సోఫాలో కూలబడింది మాలతి. అప్పుడే ప్లాట్‌ఫాం పైన విసిరేసిన సామాగ్రిలా ఇల్లంతా చిందరవందరగా ఉంది. ఈ సర్దుడు కార్యక్రమం తర్వాత చూసుకోవచ్చులే అనుకుంటూ గబగబా తెమిలి తాళం వేసి తాను పనిచేస్తున్న దగ్గర్లోని ప్రైవేట్ స్కూల్‌కి బయలుదేరింది మాలతి.

* * *

"అమ్మా! హెడ్మాష్టర్ గారు రమ్మంటున్నారు. ఏదో మీటింగ్ అట జెర జెల్దీ రండి లేకుంటే కోపానికికస్తడు" అన్నాడు ప్యూన్. చెప్తున్న పాఠం మధ్యలో ఆపి, మానిటర్‌ని క్లాసు చూసుకోమని పురమాయించి ప్యూన్ వెనకాలే పరుగులాంటి నడకతో మీటింగ్ హాల్లో అడుగుపెట్టింది మాలతి. కాస్త గంభీరంగా స్టాఫ్ అందరిని చూస్తూ గొంతు సవరించుకొన్నాడు రమణమూర్తి. "చూడండి మన పాఠశాల ఈ సిటీలో కెల్లా పేరున్న పాఠశాల.ఇంతమంది విద్యార్థుల బాగోగులు చూస్తూ, వారిని ఉన్నత విద్యావంతులుగా తీర్చిదిద్దుతున్న మీ అందరిని చూస్తుంటే ఒకింత గర్వంగాను, ఆనందంగానూ ఉంది. యూ ఆర్ ఆల్ వెల్ లెర్న్‌డ్ టీచర్స్. ఈసారి ఫేర్‌వెల్‌కు బదులుగా పిల్లల కోరికపై విశాఖ, సింహాచలం, అరకులోయ ట్రిప్ ప్లాన్ చేశాం. తొమ్మిది, పదవ తరగతి విద్యార్థులు మనమంతా కలిపి ఓ ఎనభైమందిమి రెండు బస్సుల్లో నాలుగు రోజులపాటు అలా అలా హ్యాపీగా ఎక్స్‌కర్షన్‌కు బయలుదేరబోతున్నాం. అందుకు మీరంతా సహకరించాలి. విద్యార్థులను జట్లుగా విభజించి ఎవరిగ్రూపును వారు చూసుకోవాలి. ఎల్లుండే మన ప్రయాణం. అందుకు తగిన ఏర్పాట్లును ఇప్పటి నుండే అందరూ చూసుకోవాలి" అంటూ పని విభజనను తలా కొంత పంచిపెట్టాడు రమణమూర్తి. నీ సంగేతేంటి

అంటూ మోచేతితో పొడిచింది సైన్స్ టీచర్ సురేఖ, మాలతిని. "ఏం చేస్తాం తప్పదంతే" అన్నట్టు నిట్టూర్చింది మాలతి.

ఆ రోజు మధ్యాహ్నం లంచ్ అవర్లో సురేఖ మాట కలిపింది మాలతిని, "ఏం మాలా అలా ఉన్నావ్? ఎప్పుడు చూసినా ఇంటిపని, వంటపని, అంట్ల గిన్నెలు, బట్టల మోత అంటూ బరువైన కబుర్లు చెబుతావు. మేము చూడు ఎలా ఉన్నామో? ఓ మంచి పనిమనిషిని పెట్టుకోరాదు. ఇంటి చాకిరీ, స్కూల్ చాకిరీ చేస్తూ ఎలా చిక్కి పోతున్నావో చూడు" అంది. కరెక్టే, రేఖా నువ్వు అన్నట్టు పెట్టుకోవచ్చు పనిమనిషిని, కాని మంచి అన్నావు చూడు అక్కడే వచ్చింది చిక్కంతా స్కూల్ టైమయినా ఇంకా రాని ఆవిడ గారి కోసం ఎదురు చూడడాలు, బారెడు పొద్దెక్కినా ముగ్గులు వేయని గుమ్మం, మధ్య మధ్యలో ఒంట్లో బాగోలేక లేదా ఊరికి వెల్లడం ఇవన్నీ వద్దు బాబోయ్ పనిమనిషి అంటేనే ఓ తంటా, ఎందుకొచ్చిన గొడవ చెప్పు" అంటూ కొట్టి పారేసింది మాలతి రేఖ మాటల్ని. "ఊఁ, ఈవిడగార్ని రెండేళ్ల బట్టి చూస్తున్నా ఏదీ కాణీ విదల్చదు. చాల సాదాసీదా మనిషి. ఇంట్లో కూడా వాళ్లమ్మాయితో చిన్న చిన్న పనులు చేయిస్తుందట, అబ్బాయితో కూడా బైక్ కడగటం లాంటి చిన్న చిన్న పనుల్లో సహాయం తీసుకుంటారట" అంటూ దీర్ఘాలు తీసింది మ్యాథ్స్ టీచర్ లావణ్య, సోషల్ టీచర్ గిరిజతో. "అవునా ! అందుకేనేమో, మొన్నా మధ్య మా రత్తాలును పనికి పంపితే వద్దని మొహం మీదే తలుపేసిందట. ఈ మధ్య కాలంలో పనిమనిషి కావాలి అనే వారిని చూస్తున్నాం గాని, పనిమనిషి అక్కర్లేదని నిర్మొహమాటంగా చెప్పే మాలతిని చూస్తే కాస్త అసూయగాను, విచిత్రంగాను ఉంది" అంటూ వంత పాడింది గిరిజ. ఇంతలో సెకండ్‌టైం లాంగ్‌బెల్ కొట్టడంతో కబుర్లాపి చేతులు కడుక్కోవటానికి వెళ్లారందరూ.



* * *

"హలో మోహన్" అంది మాలతి ఫోనులో "ఏమిటీ చెప్పు" విసుగ్గా అంది అవతలి కంఠం. "మీ ఆఫీసు ముందు మొబైల్ మార్కెట్ ఈరోజేగా వచ్చేది. కాస్త లంచ్‌లో వారానికి సరిపడా కూరగాయలు, పళ్ళూ తీసికోండి. "అలాగే బాబు సాక్సు చిరిగాయి. కొత్తవి రెండు జతలు కొనండి". ఇంతేనా ఇంకేమైనా ఉన్నాయా" ఎప్పుడూ ఏదో ఒక పని చెప్పనిదే నీకు మనస్కరించదు కదా, అలాగే తెస్తాలే!" ఆఫీసులో నాకు చాల వర్క్ ఉంది" అంటూనే కట్ చేశాడు మోహన్. తప్పని జీవితాన్ని ఈ విధంగా అందరి సణుగుడూ భరిస్తూ బతుకు ఈడ్చాల్సిందే అనుకొని నిట్టూర్చింది మాలతి.

మాలతి, మోహన్‌లది మధ్య తరగతి కుటుంబం. మరీ డాబు, దర్పంగా కాకపోయినా, ఉన్నంతలో గుట్టుగా ఆడంబరాలేవీ లేకపోయినా సర్దుకొని జీవిస్తున్నారు. పెద్దది పావని ఎనిమిదో తరగతి చదువుతుంటే, బాబు కృష్ణకాంత్ ఏడో క్లాసు చదువుతున్నాడు. తొందర్లోనే అద్దెయింటి నుండి రుణవిముక్తి కావాలన్న కోరికతో, ఓ యింటివాళ్లు కావాలన్న లక్ష్యంతో తమకున్న చిన్న చిన్న ఖర్చుల్ని తగ్గించుకుంటూ, దుబారాగా కాకుండా పొదుపుగా జీవనం వెళ్ళబుచ్చుతున్నారు.

ఆ రోజు రాత్రి భోజనాల వేళ అరటికాయ వేపుడు కలుపుకుంటున్న మోహన్‌తో "ఎల్లుండే మా ప్రయాణం అరకువ్యాలీకి, ఎక్స్‌కర్షన్ వెళ్తున్నాం. నాలుగురోజుల పాటు గృహసీమను పాలించే రాజు గారు మీరే" అంది మాలతి ముద్ద పప్పు వడ్డిస్తూ. "ఏంటి మమ్మీ నీవు లేకపోతే నాలుగు రోజుల పాటు డాడీ వండే చప్పిడి వంటల్ని మేం తినాలా, నథింగ్ డూయింగ్, క్రీపాయింట్ నుండి టేస్టీ క్రీస్ కొనుక్కొచ్చుకుంటాం అన్నాడు కృష్ణ. "అవునమ్మా! నీవు లేకుంటే నాకు జడలు ఎవరేస్తారు? ఇల్లంతా ఎవరు నీట్‌గా పెడ్తారు? సాయంత్రం నాకు వేడి వేడి పొంగడాలు ఎవరు చేసిస్తారు ? అంట్ల గిన్నెలతో నేనేం కుస్తీ పట్టను ఫో, నీవు లేని నాలుగు రోజులు తల్చుకుంటేనే జ్వరం వచ్చేట్లు ఉంది మమ్మీ!" అంది పావని వత్తాసుగా. మురిపెంగా చూసింది మాలతి పిల్లల వంక. నాలుగు రోజులు నేను లేకపోతే వీళ్లందరికీ నామీద ప్రేమతో కూడిన ఎంత బెంగో అనుకొంది.

"నువ్వు వెళ్లకపోతే ఏం కొంపలంటుకొంటాయట. ఇంతకీ ఆ అరకులోయకి" అన్నాడు అక్కసుగా మోహన్. "కొంపలేమీ అంటుకోవు గాని, ఉన్న ఉద్యోగానికి ఎసరు వచ్చేట్టున్నది. స్ట్రిక్ట్ ఆర్డర్స్. వెళ్లాలి అని, ప్రధానోపాధ్యాయుల ఆజ్ఞ" అంది కిల కిల నవ్వుతూ మాలతి. "సరే, నీ యిష్టం" అంటూ అనన్యమస్కంగా భోజనం ముగించాడు మోహన్.

* * *

మమ్మీ, చలిగా ఉంటుంది ఈ శాల్ పెట్టుకో" అని కృష్ణ, "తలనొప్పి, జలుబుకు ఈ బామ్ పెట్టుకో" అని పావని, "ఏమోయ్, అక్కడ అంతా ఒకవేళ చిన్నపాటి షాపింగ్ అంటారేమో ఈ రెండువేలు ఉంచూ" అంటున్న మోహన్‌లతో పిల్లలకు బై చెప్పి, ఇల్లంతా అప్పగించి, భారంగా బస్సెక్కింది మాలతి.

* * *

మర్నాడు ఉదయమే కాలింగ్ బెల్ మోతతో మెలకువ వచ్చింది మోహన్‌కి తలుపు తీయగానే విచారవదనంతో రత్తాలు. "ఏమిటీ రత్తాలు! నిన్ను అమ్మగారు పనిలోకి తీసుకోను అన్నదిగా, మళ్లీ ఇంత పొద్దున్నే ఎందుకొచ్చినట్టు" అన్నాడు మోహన్ కాస్త విసుగ్గా. "అది గాదు అయ్యా ! నన్ను గిరిజ అమ్మగారు పనిలోంచి తీసేసింది. నా చంటోడికి టైఫాయిడ్ జ్వరానికి గాను ఐదువేలు ఖర్చు అయ్యాయి ఇపుడొక ఇల్లు పాయే. మీ యింట్లో నన్నా జర ఐదు నెల్లపాటు పనిచేస్తే, ఖర్చులు ఎల్తాయని" అంటూ నసిగింది రత్తాలు. "మరి ఆవిడ నిన్ను పనిలోంచి ఎందుకు తీసినట్టు" ఆరాగా అడిగాడు మోహన్. " మా బుడ్డోడికి వంట్లో బాగా లేకుంటే అన్నీ కనిపెట్టుకొని ఉండటానికి పనికి సరిగ్గా ఎల్లలేదు బాబు అందుకని" అంటూ

ఆగింది. "అద్సరే గాని, అమ్మగారు పిక్నిక్ వెళ్లింది తనొచ్చాక కన్నడు" అన్నాడు తలుపేయబోతూ మోహన్. "అది గాదు అయ్యగారు. ఈ రోజు నుండే సేరిపోతా. నెలకు వెయ్యి తమరి దయ పని బాగా చేస్తానండి. అమ్మగోరి వచ్చే సరికి నాలుగైదు రోజులైనా పడ్తుంది. అంత వరకు మీరొక్కరే పిల్లలతో ఎలా కష్టపడ్తారు అయ్యా" అనగానే ఎదురుగా ఉన్న అంట్ల గిన్నెల వంక భీతిల్లి చూశాడు మోహన్. చప్పున రత్తాలుకు తోవయిస్తూ "సర్లే నీ యిష్టం పని మాత్రం నీట్‌గా ఉండాలి అంటూ స్నానానికి వెళ్లాడు. ఇంతలో పావని, కృష్ణ కూడా లేచి పనులు హడావిడిలో పడ్డారు.

* * *

"హలో, మమ్మీ రిషికొండ బీచ్ ఎలా ఉంది?" అడుగుతున్నాడు కృష్ణ. "చాల బాగుందిరా పెద్ద పెద్ద అలలతో సముద్రం చాల గంభీరంగా ఉంది. నీకు సిఎంఆర్‌లో ఒక టీ షర్ట్, డాడికి షర్ట్, అక్కకు కొన్ని కుర్తాలు కొన్నాను" "నీకు యిష్టమైన కారంబూందీ, సున్నుండలు చేశాను తిన్నావా" అంది మాలతి. "ఆఁ, మమ్మీ బావున్నాయి. డాడీ పనిమనిషి రత్తాలును పెట్టారు నీకు పని కష్టమవుతుందని" అంది ఫోను లాక్కొని పావని. "అలాగా, నేను లేకుంటే మీకు అందరికి పని భారం అవుతుందని పెట్టారేమోనే!" అంది మాలతి సాలోచనగా ఫోను పెట్టేస్తూ.



* * *

మరో రెండు రోజులు పోయాక సాయంత్రం ఐదు గంటలకు బస్సు దిగగానే మోహన్‌కు ఫోను చేసింది మాలతి, వచ్చి పికప్ చేసుకోమని. ఇంటికి చేరగానే ఆశ్చర్యపోవడం మాలతి వంతైంది. ఇల్లంతా శుభ్రంగా ఉంది. కిచెన్ కూడా చాలా నీట్‌గా ఉంది. అసలు తాను ఈ నాలుగు రోజులు ఇంట్లో అంత శుభ్రంగా ఉంచలేనేని అన్పించింది మాలతికి. "థ్యాంక్స్ మోహన్. ఒక మంచిపనిమనిషిని పనిలో పెట్టినందుకు. అంతేగాక మన పిల్లలకు కొంతలో కొంతైనా పని అలవాటు కావాలని మనం తీసుకొన్న నిర్ణయం, దానికి తగ్గట్టుగానే పిల్లలూ కొంత పని నేర్చుకున్నారు. ఎంతైనా తల్లిదండ్రులు తమ పిల్లలకి పరిమితమయిన స్వేచ్ఛనిస్తూనే, హద్దులు విధించినప్పుడు సరిగ్గా ఎదగగలుగుతారు. అందుకు మనం కష్టపడుతూ, వారికీ కష్టమంటే ఏమిటో నేర్పుతున్నాం. కాబట్టే మరీ బద్దకిష్టులు అవకుండా జాగ్రత్తపడ్డాం" అంతలో అందుకుంటూ మోహన్ "అంతేగాక నీకూ పని ఒత్తిడితో అనారోగ్యం కాకుండా కాస్త వెసులుబాటుగా ఉంటుందనే రత్తాలును పెట్టానుగా" అన్నాడు... అవునన్నట్టుగా తలాడించింది మాలతి.

* * *

తెల్లారి రత్తాలు సహాయంతో పనులన్నీ చకచకా ముగించి స్కూలుకి పెందరాలే తయారయ్యింది మాలతి. ఆ రోజు లంచ్ బాక్స్ తెరవగానే బంగాళాదుంప ఘుమఘుమలతో ఆలూ పరోటా, అందరికీ వడ్డించింది మాలతి. "ఏమిటో మాలతి గారు, చాలా చలాకీగా, హుషారుగా ఉన్నారు. ఏం విశేషమేమిటీ?" అంది లావణ్య కాస్త పరోటా ముక్కను రైతాలో అద్దుకొంటూ, "ఆఁ, విశేషమేముంటుందీ, ఏ ఫ్లాటో గీటో కొన్నారు కావచ్చు" అంటూ ముక్తాయించింది గిరిజ. "అదేం కాదు రత్తాలు లాంటి మంచి చురుకైన పనిమనిషి దొరికిందని" అంది సురేఖ సన్నగా నవ్వుతూ." అబ్బబ్బ ఆపండి బాబూ! మీ మాటలు. అందరివీ కరెక్టే! అందుకేగా ఈ స్వీటు" అంటూ మలాయి లడ్డూతో అందరి నోరు తీపి చేసింది మాలతి.

* * *

"అమ్మగారు ఆ రోజు మీరే లేకుంటే నా బతుకు బుగ్గిపాలేగా" అంటూ ఆరోజును తల్చుకొని కన్నీరు మున్నీరయ్యింది రత్తాలు. ఇంతకీ ఆరోజు సన్నగా జ్వరం రావడంతో డాక్టర్ కృష్ణమూర్తి ఫిజిషియన్ దగ్గరికి వెళ్లింది మాలతి. మూడేళ్లన్నర్థం కొడుకుని ఒళ్లో వేసుకొని ముక్కు చీదుతూ కూర్చుంది రత్తాలు. "ఏమిటి రత్తాలు. ఇలా వచ్చావేం? చిన్నోడికి బాలేదా ఏంటీ?" అనునయంగా మాలతి అడిగేసరికి కాపాడమని కాళ్ల మీద పడింది రత్తాలు." అమ్మగోరు ఇంజషను, సూది మందు, గ్లూక్లోజులంట, నా కొడుకు పాణం మీ చేతిలో అమ్మా, పిల్లగాడు గా మురికినీళ్లు తాగితే వాంతులు, విరేచనాలు అయ్యాయి అమ్మా జర ఒక వెయ్యి రూపాయలు అప్పు ఇయిండి అమ్మా!", మీ పిల్లలు చల్లంగ ఉండ" అంటూ కాళ్లా వేళ్లా పడింది రత్తాలు. జాలేసింది మాలతికి తన పిల్లల లాగే దాని పిల్లలూనూ. "ఏం, ఆ గిరిజమ్మను అడుగలేకపోయావా' అంది, "గా అమ్మ ఇయ్యకపోగా, బగ్గరోజుల బట్టి పనిలోకి పోకుంటే పని మానిపించిందమ్మా!" అంది కళ్లొత్తుకుంటూ.

"సర్లే ఇంద ఈ వెయ్యిరూపాయలతో పిల్లవాణ్ణి బాగా పరీక్షలు చేయించి, ఆరోగ్యం కాపాడుకో" అంటూ రెండు పచ్చనోట్లు చేతిలో పెట్టింది. "అమ్మగోరూ, నీ రుణం ఉంచుకోను. రేపటి నుంచి మీ యింట్ల కష్టపడి పనిచేస్తా అమ్మా!" అంది కళ్లనీరు గిర్రున తిరుగుతుండగ రత్తాలు.

అవసరం పడ్డపుడు మనిషిని మనిషి ఆదుకోవాలి అన్న సత్యం బోధపడిన దానిలా చిన్నగా నవ్వింది ప్రియబాంధవిలా మాలతి. మరీ మెటీరియలస్టిక్ ఐన సమాజంలో మనం చేసే చిన్న చిన్న పనులే మనల్ని ఉన్నతంగా నిలబెడతాయి. మరో ఐదు నెలల్లో కొత్త యింటకి మారబోతున్న మాలతి, రత్తాలు అప్పుతీర్చే మార్గాన్ని నెత్తిన వేసుకొంది అలానే. ఓ చిన్న చిర్నవ్వు, ఓ స్నేహపూరిత హస్తం, ఓ ఆత్మీయ పలకరింపు ఇవేవీ వీటికి మినహాయింపు కాదు. కాబట్టే మాలతి తన దృక్పథాన్ని మార్చుకొని ఓ చిన్న సహాయం, ఓ భరోసా తనకున్న దాంట్లో చేసేందుకు ముందుకు వచ్చింది. తాను లేనపుడు తన యింట్లో పనికి కుదుర్చుకొనేలా రత్తాలును మాట్లాడుకుందన్న సంగతి పాపం మోహన్‌కి తెలీదు. ఐనా మనసెరిగిన భర్తగా మోహన్, ప్రియబాంధవిలా మాలతి తమకున్నదాంట్లో రత్తాలు చీకటింట చిరుదీపాన్నుంచి ఆదర్శప్రాయులైనారు.



# గోరటివెంకన్న పాటలు పల్లె, ప్రకృతి, లోకంపోకడ




కడియాల రామమోహనరాయ్

ప్రజా గాయకుడు గోరటి వెంకన్న పాటను ఒక్కసారి విన్నవారెవరైనా దాన్ని ఎప్పటికీ మరచిపోలేరు. అది సాహిత్య సభైనా, పౌర హక్కుల సభైనా, ప్రత్యేక తెలంగాణ సభైనా, పల్లె పట్టణ, నగర ప్రజలు ఎవరి సభైనా గోరటి వెంకన్న గాన ప్రదర్శన సభా సదులను ముగ్ధుల్ని చేస్తుంది.

వెంకన్న గాయకుడే గాక కవి. ఆయన పాటలు జానపద శిష్ట సాహిత్య సమ్మిశ్రితాలు. ఆయన భావుకత సున్నితమైనది, అసాధారణమైనది. ఆయన పాటల్లో పల్లెలు, ప్రకృతి సరికొత్త అందాలతో కనువిందు చేస్తాయి. పేదల కడగండ్ల గూర్చిన ఆయన ఆవేదన సహృదయుల గుండెలు కదిలిస్తుంది.

తొలకరి వాన హాయిని కలిగిస్తుంది. 'వానా వానా వల్లప్ప' అంటూ పిల్లలే గాక పెద్దలు గూడ వానను స్వాగతిస్తారు".

"వానొచ్చెనమ్మా వరదొచ్చెనమ్మా !
వానతోపాటు వణు కొచ్చెనమ్మా !
కోడిపుంజు జుట్టు కొంటెగ తాకింది...
పరికిపిట్ట ముక్కు పాసిని కడిగింది
ఎద్దుమూపురాన్ని ముద్దాడి మురిసింది"

ఇంకా "కొత్త నీటితో వచ్చి కోనేట్ల జేరింది
కప్పలపండుగ కనులార జూసింది
తాబేలు పెండ్లికి తలనీరువోసింది.
రేగటి నేలను మాగాణి జేసింది...
తాను రాక ముందెతూనీగలలేపి
తన పాటకే తాను దరువేసి ఆడింది..
నీరెండ పొలుపుకు నిగనిగ మెరిసింది..
పారాడి పారాడి గోదారిలో కలిసి
సీతమ్మ పాదాల శిరసొంచి తాకింది" ప్రతివర్ష ఋతువులో జ్ఞాపకం చేసుకోదగిన పాట వానొచ్చెనమ్మా".

పల్లెలో వేకువ హాయిని" సోయిలేని హాయి సూడ సక్కనిరేయి/.. ఉండిలేనట్లు ఊరించెవేకువ గాలి / పిల్లగాలి / పాటకే, పల్లె మైమరసె/.. గూటిలోని కొంగ ఎగిరెపాల బుంగ / వెండి రెక్కల సూపి ఏటి తావుల నేగె / వేకువతో ఆకలే మెదలాయెనో / లేక ఊకనె కొంగమ్మ ఊరి డిసెనో / ... కునికె పిట్టల ముక్కు లందానికి / పూల పుప్పొడి గంధమే దిద్దెనా / సిలక కొరికిన పండు మురిపెంగ మాగించ / మగరు తగ్గివనం గాలి తీపిని పెంచే పల్లెలో చెట్టూ పుట్టా, పిట్టా, గాలి, ఎండా, వానా అన్నీ వెంకన్నకు తోబుట్టువులే వాటి మధ్య తన లోకంలో తానుంటారు.

"రాగి చెంబుకు మామిడాకు పట్టిని గట్టి / కోవెల కోనేటి పుణ్య తీర్థము నింపి / ముంగిట ఎద్దులకు మువ్వజతలమరించి / పొడువైన కాడకు పొదిగిన గొడ్డలితో / యాగిడిల్లె అన్నదాతను దీవింప / రావే మా చైత్రమా అనురాగ సుమీ హస్తమా !" రైతుకు శుభం కోరిన యీ గీతంలో భాష శ్రోత్రియులదే" యాగిడిల్లె" వొక్కటే పల్లె ప్రజల మాట (రావే మా చైత్రమా!)

"వాగు ఎండిపాయెరో / పెద్దవాగు తడిపేగు ఎండిపాయెరా / అందాల దుందుభి అలసెంద్రవంక / జల మెరుపు తీగ తడి పరుపు బండ/ ఆరుగాలం పారేవాగుల / ధార సైతం లేక ఎండె" విద్వాన్ విశ్వంగారి పెన్నేటి పాట"లో ఇంత మంచి కన్న తల్లి పెన్న ఎందుకెండిపాయెనో" అని కవి వగచినట్లే వెంకన్న "వాగు ఎండిపాయెరా" పాటలో పల్లె ప్రజల గుండె ఘోషను ఆలపించారు." ఆలమందలు మేకమందలు / అడవి కంచెల మేపు మేసి / దాహమయినా గొడ్డుకొచ్చి / తాగి సేద తీరుచుండేటి తీరముల ఆపసుల గిట్టల / తావులో జల ఊటలు బుకగ పిట్టలొచ్చి ముక్కలద్దేటి / మట్టి సరికెలు మాయమాయె" నాగరికులకు తెలియని యిటువంటి ప్రకృతి దృశ్యాలు వెంకన్న పాటలో అద్భుతంగా కన్పిస్తాయి.

రసాయనిక ఎరువుల వాడకం వల్ల, పెట్రోలు యంత్రాలను వాడటం వల్ల, ధ్వని కాలుష్యం వల్ల ప్రకృతి రూపు రేఖలు మారిపోయినై. చాల పక్షులు కన్పించకుండా పోయాయని వెంకన్న ఆవేదన చెందారు.

గోరెంక పిట్టల సవ్వడేమాయె... దేవతమ్మో దేవసిరిమల్లె
రంగుపాల పిట్ట ఏరాజ్యమెల్లె
కొంగబావలు నిగిబారులేమాయె
పలికెటి సిలకల అలికిడేమాయె
గంతులేసె జింక గుంపు లేమయిపాయె
కుందేలు మందల పరుగుపందాలేవి"

వానలు, కరువైన చోట రైతుకంట కన్నీరె! నదీ జలాలను కాలువల ద్వారా పొలాల్లోకి పారించుకునే అవకాశం లేనిచోట రైతు బాధ మరింత దుర్భరం.




# రాజకీయ (వి)నాయకుడు

మల్లెను తిడతాడు, సరిగా పూయలేదని,
కాని, పందిరి వేయుట మరుస్తాడు !
పల్లెను తిడతాడు, ప్రగతి సాధించలేదని,
కాని ఏ పథకం వారిదరి చేరనీయడు !
ప్రతి పక్షాలను తిడతాడు ప్రగతి నిరోధకులని,
కాని, తన నియంతృత్వపోకడలు వీడడు !
వాగ్దానాలు చేస్తాడు, స్వర్గం భువికి దిగి వస్తుందని,
కాని, నరక ద్వారాలను మూయనీయడు !
ఉపన్యసిస్తాడు, సర్వ మానవ సౌభ్రాతృత్వాన్ని !
కాని, ప్రోత్సహిస్తాడు సంకుచితతత్వాన్ని !
ఆశిస్తాడు సామ్యవాదాన్ని, సమసమాజ స్థాపన కోసం
కాని, వీడడు ఇసుమంత స్వార్థాన్ని, జనహితం కోసం !
ఊరిస్తాడు, అంతా బాగుందని, అభివృద్ధి జరిగిందని
కాని, గుర్తించడు ప్రజల కనీస అవసరాలు ఇంకాతీరలేదని
గరీబీ హఠావో.. వాడి నినాదం
కాని, గరీబోంకా హఠావో వాడి నైజం !

తోపుల సాంబశివరావు
9676189134

---

"పత్తిసేలు మిరపసేలు కుత్తుకెండి కుంగిపోయె
మక్కజొన్న తెల్లజొన్న సిక్కిపోయి శిరసులొంచె
ఆముదాలు కందిసేలు తేమలేక పాలిపాయె
పాలుగారే వేరు సెనగ ఊడలన్నీ ఆరిపాయె
కాసెపంట లెందుతుంటె – దేవదారు తుమ్మతియ్యాలో
రైతు ఆశలు డిగే గొసదిసే – దేవదారు తుమ్మతియ్యాలో
ఒక్కపూట తిండికొరకు / ముక్కు పుల్లలమ్ముకుండ్రు !"

అట్టడుగువర్గాల జీవిత విశేషాలు వెంకన్నకు బాగ తెలుసు" సుక్క పంది పిల్లపుడితె

శుభం జరుగని మురిసెటోడు బట్టపందికి కల్లుదాపి భాగవతమాడించెటోడు" పేదల బతుకుల్లో విషాదమే గాక; వేడుకల జాడలు గూడ యాయనపాటల్లో ఆనందం కలిగిస్తాయి." చెయ్యి ఎత్తెలేసి ఆడె / నల్లతాసు నొడిసిపట్టి

వడిసె తిప్పినట్టు / వీడిదడిగ తిప్పెటోడు
పానముండగ దాని / పంటి కోరల విషం పిండి
పడగలేపి బుసలు గొట్టే / పామునె వణికించెటోడు
ఊరి పెద్దల జూసి ఎందుకో / నాగన్న
ఎనకట ఉరుకులు పరుగులు పెట్టేది"

గ్రామ పెత్తందారీ తనానికి ఎంతటి సాహసులైన తలవొగ్గటాన్ని వెంకన్న పిట్ట పరుగనాగన్న పాటలో సొగసుగా తెలిపారు.

'సంత' గూర్చి వెంకన్న పాట చాలమందిని ఆకర్షించింది" కాయ గూరల తట్ట / ఆకు కూరల కట్ట

తమలపాకుల బుట్ట తంబాకు పొడిమట్ట మిరపకాయల ఘాటు వొట్టి చేపల సోటు అల్లమెల్లిపాయ కుప్ప కగ్గువరేటు" ఒకరినొకరు కలుసుకొని పరామర్శలు, పెళ్ళి సంబంధాలు, చిలిపితగవుల అన్నీ యీపాటలో వున్నాయి.

పేదవాళ్ల ఇళ్లల్లో ఏ వస్తువులుంటాయో కొంత మంది కవులకు, రచయితలకు తెలియదు–నూటికొక్క ఇంట్లో కూడ మంచి ట్యూబ్‌లైట్ వుండదు; సెకెండ్ హాండ్ టి.వి., మోతపెట్టేఫోన్, సెల్ అయిపోయిన రిస్ట్‌వాచ్, పండ్లిరిగి పోయిన దువ్వెన, పగిలిన అద్దం – వీటిని గూర్చి వెంకన్న పాడుతున్నప్పుడు శ్రోతలకు అవి అన్నీ తమను గురించే పాడుతున్నట్లునిపిస్తుంది (గల్లీసిన్నది)

ప్రకృతే వెంకన్న గురువు "పాల నురగల ఏరుపాటకు దారి చూపింది".

ఆధునిక జీవితంలో వస్తున్న మార్పుల్ని వెంకన్న సెల్‌ఫోన్ 'పేదల బతుకుల్లో గూడ విడదీయ రాని భాగమైంది' రేపు కూలుందా లేదా మేస్త్రిరని కూసోని నంబరొత్తుతున్నడు / వెట్టి బతుకుల మీద కూడ ఎంతమత్తు జల్లెర సెల్లు / ... అగ్గిపెట్టె సుట్టలోలే అందరి జేబుల సెల్లు". సెల్లు ఆధునిక జీవితానికి శాపమైంది గూడ" / టెర్రరిస్టు పన్నాగాల నెత్తుటిగన్నాయె సెల్లు"

వెంకన్న పాడుతున్నప్పుడు శ్రోతలు తమలోవొకరు వేదిక ఎక్కి ఆడిపాడుతున్నట్లే అనుకుంటారు. ఎవరో ఎక్కడి నుంచో వచ్చి పాడుతున్నట్లు తలచరు.

"పిట్ట బతుకు ఎంతోహాయి" అని తలచే వెంకన్న ఒక రాజకీయ పార్టీకి సిద్ధాంతానికి కట్టుబడినట్లనిపించరు. పేదల బతుకులు బాగుపడాలన్నదే తన ఆట, పాట లక్ష్యంగా తలుస్తారు. వెంకన్న పాట వినదగ్గది. విని ఆలోచించదగ్గది.

వెంకన్న పాటలో ప్రకృతి సొగసైనది; లోకం పోకడపై కవి వ్యాఖ్యలు ఆసక్తికరమైనవి; చమత్కార భరితమైనవి.

## భ్రమ - వాస్తవం

ఎన్.సి.హెచ్. చక్రవర్తి

9399958069



సూర్యుడు అస్తమించాడనుకోడం భ్రమ
చూపుకు ఆనక చంద్రుణి తోస్తాడు
కళ్లద్దాలు మాస్తే కాంతిరేకలెలా ఆన్తాయి ?
మసిపూత ఉన్నప్పుడు అద్దాలు మారినా
పవరు చూపేదే అసలు బొమ్మ..
బాధా సర్ప పరిష్వంగంలో
సుధా పానమెలా సాధ్యం ?

కురవక కురవక అలసిన మేఘాన్ని
కోట్ల వినసకర్ర లూదితే నేమీ ?
విష గుళికలు మింగిన భూమిలో
బీజావాపనం చేసిన ఫలం ?
పూత్కరించే తెమ్మెరలకు
మూఛ్చిక్కం వేయగలమా ?
చిక్కాలన్నీ మనం తగిలించుకొని
బొక్కామనుకోడం వాస్తవమా ?

రోగానికి పూలు పరుస్తూ
రోగికి సూదులు గుచ్చితే
మేధస్సుకి సమాధి కడుతూ
మేనుల నూరేగిస్తే
కనుపాపలే మసిబారుతాయి

పొలం గుండె లెండిపోతే
హలం ఎలా పొదుగుతుందీ ?
లంగరుమాట వినినంత కాలం
లంకంత ఓడ నీటి దారికెక్కదు

దేశీయ బురఖా తొడిగి
తైతక్కలాడుతుంది వలసవాదం

పావేదీ తనంత కదలదు
ఆ'వెనుక చేయి' లేనిదే...

మనం వాస్తవమనుకునేదంతా 'భ్రమ'
'భ్రమ' అనుకుంటే అది వాస్తవం-

---

## మడతలు విప్పుకున్న జ్ఞాపకాలు

సౌగంధి యసస్విని

9948714105



కళ్ళల్లోకి జారే వెంట్రుకల్ని
ఎనక్కి నెట్టుకొని
జారే చెడ్డీనెగేసుకుంటూ
కట్టుకున్న ఇసుక గూడులు
ఒక్కొక్కటిగా మెలిపెడుతూనే ఇంకా......

-0-

మనవడిష్టమనే
ర్యాంప్ సాంగ్ విన్నప్పుడల్లా
జతగాళ్ళతో కలిసి పాడిన
"రింగు రింగు బిళ్ళ"
పాట గుర్తొస్తుంది
క్షణకాలం పాటు
నా దేహమ్మొత్తం పాటవుతుంది

-0-

"చింటూ ఎక్కడికిరా
వానలో తడిస్తే జలుబు చేస్తుంది"
కోడలిపిల్ల మాటలు విన్నప్పుడల్లా
సాహసగాళ్ళతో కలిసి
వానలో తడుస్తూ
పిల్లకాల్వల్లోకి దూకే
పడవల సమూహాలైన దృశ్యాలు
నాకళ్ళలో మెదలాడుతుంటయ్

వంటింటి పోపుడబ్బాల్లోనో
కాగితపు మడతల్లోనో
ఒక్కొక్కటిగా పేర్చుకొన్న జ్ఞాపకాలు
అప్పుడప్పుడూ
నావైపే జాలిగా చూస్తుంటాయి
నిస్సహాయున్నై
ఏ స్పందనా లేకుండా
మరమనిషి గా నేను....?

-0-

ఇంటిళ్ళ పాదీ
కల్సికూర్చొని వడ్డించుకొని
కడుపారా తిన్న రోజులు
తినేసమాయాన్నే కుదించుకున్న
జీవితాల్నుండి
దూరంగా... మానుండి
ఎప్పుడు జరిగిపోయాయో?
మెలిపెడుతున్నాయింకా...

-0-

చెంగుపట్టి లాగిన స్పర్శ..
ఫాన్ గాలికి చెల్లాచెదురైనా
డైరీలో కాగితాలు

-0-

నావాళనుకున్న వాళ్ళ
ఏ పలకరింపూ లేని
మౌన సంభాషణ
నాచివరి రోజులకిది
రోజువారీ కార్యక్రమైందీ
ఓల్డేజ్ హోంలో....



# ఋషి

- దాసరి రాజేంద్రకుమార్

9000544608

"లోకానికి నామొకం సూపడానికి సిగ్గేత్తంది. నేనుసేసిన పనికి నామీద నాకే అసహ్యమేస్తంది. కళ్ళు మూసుకుని బుక్కడు మందు మింగిత్తే మరే బాధలు వుండవనుకున్నాను. దానికీ నామీద దయనేకపోయింది."

"నేను ఈ పనిసేసానని పదిమంది పదిరకాల మాటలంతన్నారు. అవి నాసెవిన పడతన్నాయి. నామీద అభిమానముతోటి కొందరు, ఎటకారంగా కొందరు ఏదేదో అంతన్నారు. నానెందుకు ఇలగ సేసుకున్నానో, ఇలగ సేసుకోవడానికి ఎంత బాధపడ్డానో ఎవరికేటి తెలుసు? ఇంసపడినోడికి తెలుత్తాది ఆ నరకమేటో! ఎద్దుబాధ కాక్కేటి తెలుత్తాది. ఎవ్వలు నోటికొచ్చిన మాట ఆలు అనెత్తన్నారు."

"నానుపడ్డ ఇంస పగోడైనా పడకూడదు."

మాఊరిలో అన్నీ మెట్టుపొలాలే. మాఊరు సుట్టూ పొలాలు. మద్దిన మా ఊరు మాది పెద్దూరే. ఏడెనిమిది వీధులుంతాయి. ఎక్కడ నుంచో మా ఊర్లోకి వలస రైతులొచ్చినారు. మా ఊరు సుట్టూ వున్న మెట్టు పొలాలన్నీ కొనుక్కొన్నారు. రైతులు ఆళ్ళ అవసరాల కోసం పెళ్ళిల్లు, పేరంటాలు, చావులు, పుట్టుకలు, బాధలు, బంటీలు తోటి అప్పులు పాలై పోట్టు మెట్టు భూములు సవగ్గా అమ్మీసారు.

నా పొలమూ అడిగారు. నాకున్నిది ఆ రెండెకరాలే.... నాను అమ్మనని కరాఖండీగా సెప్పీసాను. మా ఊరోళ్ళు అమ్మీసిన పొలం పాతిక ఎకరాలుంతాది. మా ఊర్లోనే కాదు మా సుట్టు పక్కల ఊరుళ్ళోన వలస రైతులు పొలాలు

కొన్నారు. వలస రైతులు కొనుక్కున్న పొలాలో అరటి, వరి, కర్బూజా, జామ, కొబ్బరి, నిమ్మ పంటలు ఏసారు. మాఊరు సుట్టూ పచ్చగా వుండేది. ఆళపొలం దిగువనే నాపొలం. వలస రైతు ఆళపొలం సుట్టూ ఎలుగు పెట్టిసాడు. ఎలుగంతే కంపలు ఎలుగు కాదు. నానెపుడూ సూడనేదు. పొలం సుట్టూరాలు పాతి ఇనప తీగలు తోటి ఎలుగు పెట్టించాడు.

నిలువెత్తు అరటిగెలలు ఆకాశములోన నుక్కల్లాగ కర్బూజాకాయలు, గుత్తు గుత్తులుగా కాసే జామితోటలు, కుంచమంత కొబ్బరి బోండాలు, బంగారంలా మెరిసే నిమ్మకాయలు, సూసినోలందరూ ముక్కు మీద ఏలేసుకుండోలు.

మా ఊరికాసి వరిపంట తప్ప వేరే పంట గురించి తెలీదు. వరి, మినుములు, పెసలు, ఉలవలు, జనుములు పంటలు తప్ప మరే పంటలు పండించడము తెలీని మమ్మల్ని అదొకలాగ సూసీవోళ్ళు.

వలస రైతుల పొలం దిగువనే నారెండు ఎకరాల పొలం. వలస రైతుల పొలం ముందు నాపొలం దిష్టి బొమ్మలావుందని మా వూరోళ్ళందరూ నన్ను ఎగతాళి సేసీవోళ్ళు. ఎవరేమన్నా పట్టించుకునోడ్ని కాదు. నా పని నానుసేసుకునోడ్ని.

నేనెపుడూ పొలం పట్టునే వుండేవోడిని.పొలం పనితప్ప వేరే పని నాకు తెలీదు. పొలం, ఇల్లు ఇవే నాకు లోకము. పండగలు పబ్బాలు, పెళ్ళిల్లు, పేరంటాలు ఏమైనా పనులుంతే మా ఆవిడ ఆదమ్మ సూసుకుండీది. నాకేటి తెలీదు. ఏపనైనా ఆదమ్మ ఎళ్ళేది. పొలానికి యూరియా, పురుగు మందులు కొనాలన్నా మా ఆవిడే ఎళ్ళీది. దేనిరేటు ఎంతో నాకు తెలీదు. ఉప్పు నుంచి పప్పు వరకూ ఆదమ్మ కొనీది. నానెపుడూ పొలానే వుంతానని అదేదో పేరు పెట్టారు. అసలు పేరు తీస్సి కొసరు పేరు పెట్టారు. నా పేరు ఎవరికీ తెలీదు. పేరు గురుతు రాకుంతన్నాది.



ఆ...ఆ... ఋషి అని పిలుత్తారు. ఎపుడూ పొలానే వుంతానని, ఏదో ఒక పని సేత్తుంతానని, పట్టినపట్టు వదలకుండా వుంతానని, కోడిగూసిన ఏళకి పొలానికి ఎళ్ళినోడ్ని పొద్దు గూకిన తర్వాత ఇంటికి వత్తానని ఋషీశ్వరుడు అని పేరు పెట్టారు.

నాకు ఊరోళ్ళకి ఏ సంబంధము నేకుండా పొలానే వుంతాను. నాయకులు పిలుత్తారు కాని నానెపుడూ ఆళ్ళన కత్తల ఎళ్ళలేదు. నాపేరు ఎవలకీ తెల్దు. నా అసలు పేరు సన్యాసి నాయుడు ఆపేరు పెట్టి ఎవులూ పిలరు. ఎవులైనా సుట్టాలొచ్చి నా పేరు పెట్టి అడిగినారంతే సెప్పరు. ఋషినాయుడు అని అడిగితే పలాన వీధిలో వుంతాడని సెప్తారు. ఇపుడు గుంటలకైతే నేను పూర్తిగా తెలీదు. మాయింటి కొచ్చిన సుట్టాలు పొలానికే వత్తారు. పొలానే కష్ట, సుఖాలు మాట్లాడుకుంతాం.

వలస రైతులు పొలానే స్లేబిల్లులు కట్టుకున్నారు. వలస రైతు నా ఊరి నాయకులు కంటే పెద్ద మనిషై పోనాడు. మా ఊరి నాయకులందరూ వలసరైతు ఇంటికి ఎల్తారు. గంటల తరబడి బాతాకానాలు కొడుతుంతారు. మాఊరి నాయకులే కాదు ఎమ్మెల్యే, మండల పెశిరెంటు, పెద్ద పెద్దోలంతా మాఊరొస్తే ఆలింటికే ఎల్తారు. పార్టీలంగట్ట సేసుకుంతారు. కుంచమెళ్ళి అడ్డల దూరిందట. వలస రైతు వున్నోడు ఒక్కడు ఏ బలమూనేనోడు. మరాడి దగ్గరేంటుందో ఆడి సుట్టూ తిరుగుతుంతారు నాయకులు. ఈ ఊరోడా! ఈ వాడోడా ! ఎక్కడ్నుంచి వచ్చాడో తెల్దు అందర్ని వరసలు పెట్టి పిలిసెత్తాడు.

వర్షాలు లేక పొట్ట మీదున్న వరిసేని ఎండిపోయింది. ఎండినసేని కోసీసి పశువులికి ఏత్తన్నానను. 'ఋషినాయుడూ'... అన్నమాట వినిపించింది. నన్ను మాఊర్లో ఎవరూ అలాపిలవరు. ఏదో ఒక వరసపెట్టి పిలుత్తారు. గతుక్కున 'ఎవ్రలా' అని సూసాను. ఎదురుగా వలసరైతు. "వరి పంట ఎన్నాళ్ళు పండిత్తావు. నీకేంటి ఆదాయము వత్తాది. పొద్దస్తమానము నువ్వు కట్ట పడినా ఎకరాకి మూడు, నాలుగు వేలు మిగుల్దు.

అరటి పండేత్తే ఎకరాకి పాతిక, ముప్ఫై వేలొత్తాది. అరటి పంటేసుకో నాబోరు నుండి నీకు నీరు ఇత్తాను" అన్నాడు. ఇంటికెళ్ళి ఆదమ్మతో. విషయము సెప్పాను. "ఊర్లోన అగ్గిపుట్టి ఇల్లు కాలిపోతే గవర్నమెంటిచ్చిన ఇల్లు కట్టాము గచ్చులు లేవు. సెక్కసున్నాలు నేవు. వలస రైతు సెప్పినట్టు సేస్తే ఇల్లైనా బాగుసేసుకుందుము. ఎప్పుడూ ఈ బతుకేనా అందరూ మారతన్రు మనమెపుడు మారతాము. వలస రైతు సెప్పినట్టుసెయ్యి" అన్నాది అదమ్మ. దానిమాట కొట్ట నెప్పొన్ను వలస రైతుదగ్గర అరటి పిలకలు తీసుకుని అరటితోట ఏసాను. వలస రైతు సెప్పినట్టు అరటికి కావలసిన సదుపాయాలన్నీ సేసాను. వలన రైతు బోరు నుంచి అరటితోటకు నీరు ఇచ్చాడు.

వలస రైతు పొలాలు లాగే నాపొలం నిలువెత్తు అరటి గెలలు కాసింది. పంట బాగా పండి వలన రైతు సెప్పినట్టు గానే డబ్బులొచ్చాయి. గచ్చులు, సెక్కసున్నాలు లేని ఇంటిని బాగు సేయించుకున్నాను. పిక్కిరోలు టీ.వి సుద్దానికి ఆలింటికి ఈలింటికి ఎల్తన్నారని ఆదమ్మ టీ.వి కొనేసి ఇంట్లో పెట్టింది.

రెండో ఏడాది పంట కోసం అరిటి తోటను బాగుసేసి తారిలు యేసాను. యూరియా, గడ్డి మందు జల్లాను. ముందటేడు నాగే మళ్ళ ఏడు కూడా అరటి తోట బాగా గెలలు యేసింది. నువ్వూ కూడా వలస రైతుల్లోన కలిసిపోనావురా!' అని ఇగట మాడోలు మా ఊరోలందరు.

మరొక నెలరోజుల్లోన పంట సేతికొత్తాదనీసరికి గాలొచ్చి అరటి తోటంతా ఇరగ్గొట్టిసింది. వాయుదేవుడి కోపము నాకు శాపమైపోయింది. గవర్నమెంటు అరటి తోటలు పోయినోళ్ళందర పేర్లు పంపించమంతే సెక్రటరీ పేర్లు రాసి పంపించినాడు. ఒక సంవత్సరము పంట పోయిందని పంటెయ్యడం మానెత్తామా? రైతు అన్నోడికి ఆటు పోట్లు వత్తాయి. అలాగని యవసాయము మాన్నేము. పడిపోయిన అరటి తోటంతా బాగుసేసి మూడో పంటకి సిద్ధం సేసాను.

అరిటి పంట పోయినోల్లందరికీ నష్ట పరిహారం ఇత్తన్నారు రైతులందరూ రామ మందిరము దగ్గరకి రావలసిందిగా ఎండయ్య

దండోరా ఏసాడు. అందరితో పాటు నేను ఎల్లాను. నష్టపరిహారం వచ్చినోళ్ళ పేర్లు చదువుతూ ఎమ్మెల్యే మండల పెశిరెంటు చేత చెక్కులు అందిత్తన్నారు. చెక్కులు వచ్చినోళ్ళ పేర్లన్నీ చదువుతుండే రామమందిరము మీద కూర్చునోళ్ళందరూ ఆశ్యర్యపోతండ్రు. కొంతమంది రైతులుకి కోపాలు కూడా వత్తన్నాయి. అయినా నాయకుల్ని ఏమి అనలేరు. నా సెక్కు ఎపుడు వత్తాదా? అని నాను ఎదురు సూత్తన్నాను. చెక్కులు పంచడము అయిపోయిందంటూ అధికారుల లేచి ఎలిపోతండ్రు. నాను కోపం ఆపుకోలేక ఆవేశముతోటెల్లి నాయకుల్ని నిలదీసాను.

"నీకూ ఊరికీ.. సంబందము నేదు. నువ్వు ఋషివి గదా! అలాగే బతుకు" అని వెటకారంగా మాట్లాడారు. ఎక్కువగా మాట్లాడితే తంతామన్నారు. ఆలంతన్రో నేదో నాయకుల్ని రాసుకుని తిరిగిన విశ్వనాదం వచ్చి నా మీద సెయ్యి చేసుకున్నాడు. మరక్కడ ఏమన్లేక ఇంటికి ఎలిపొచ్చాను. ఊర్లో ఉన్నోళ్ళందరికీ కుటుంబ బలము వుంది. నాకు ఏ బలమూ నేదు. ఒంటిగాడ్ని నా ఎనకత్తల వచ్చినోళ్ళు ఎవరూనేరు. అక్కడకాసి కాళ్ళు యీడుసుకుని వచ్చీసాను.

ఇంటికి వచ్చీసరికి చెక్కు ఎంత కొచ్చిందని ఆదమ్మ అడిగింది. అరిటిపోయినోళ్ళ వరకీ చెక్కులు రానేదు. భూమి మొఖం సూడని, అరటి పంటెయ్యని కో ఆపరేటివ్ పెశిరెంటుకి పదిఎకరాలకి, భూమి బోగబంద పెట్టెసిన కృష్ణమూర్తికి ఐదు ఎకరాలకి, సెక్రటరీ అల్లుడు లచ్చన్నాయుడుకి పది ఎకరాలకి నాయకుల ఎనకత్తల రాసుకుని తిరిగినోలందరకీ, ఈదుల్లోన మాట్లాడిన మాటలు నాయకులు దగ్గరకి మోసుకెళ్ళినోలికి చెక్కులు వచ్చాయి. అలగని నేనడిగానని నాయకులు నాకు తంతామన్నారు. ఆలనోట్లో మాటుంది విశ్వనాదం వచ్చి నామీద సెయ్యి సేసుకున్నాడు. "నాయకుల చెప్పులు మోసినోడు ఆడికంత గిర్వానము పెరిగిందా? ఆడిసేతులు పడిపోను" అని ఆదమ్మ శాపనార్థాలు పెట్టింది.



అరటి పంట కోసం వలస రైతు దగ్గర డబ్బులు అప్పు తీసుకుని యూరియా, గడ్డి మందు జల్లాను. మూడో ఏడుపంట సేతికొత్తే ఇబ్బందుండదనుకున్నాను. ఈనోగా ఆదమ్మకి కాలు, సెయ్యి పడిపోయింది. డాక్టర్ల దగ్గరకి తిప్పించాను. ఎన్ని ఆస్పత్రులుకి తిప్పినా ఎంతమంది డాక్టర్లకి చూపించినా వేలకి వేలు ఖర్చు అయిపోనాయి తప్పా జబ్బు మాత్రం తగ్గనేదు. వలస రైతు దగ్గర అప్పుసేస్సి ఎక్కడకంతే అక్కడకి తిప్పాను. ఎన్నిసేసినా ఆదమ్మ మర్నాకు దక్కనేదు.

అరటి తోట బాగా పండించుదుమనుకున్నాను. ఎలక్షన్లు ముందు నాయకులు యవసాయముకి తొమ్మిది గంటలుసేపు కరంటు ఇత్తామన్నారు. గద్దెక్కి కూకున్న తర్వాత అవన్నీ మరిసిపోనారు. యవసాయముకి తొమ్మిది గంటలు కరంటు మరివ్వలేము ఏడు గంటలు కరంటు ఇత్తామని తెగేసి సెప్పీసారు. ఆ ఏడుగంటలు కరంటైనా ఒక్కసారి ఇవ్వనేదు. నాలుగు గంటలు ఒకసారి మూడు గంటలు ఒకసారి ఇచ్చోళ్ళు. ఉదయము నాలుగు గంటలు కరంటిత్తే మద్దిరాతిర్ని మల్లా మూడు గంటలు కరంటిచ్చోళ్ళు. యాసవి కాలం పొలాలు ఎండిపోతుండేవి. బోరు నీరు కడతుంటే కట్టిన మరకే మళ్ళీ కలిసేది. నాలుగు గంటలు కరంటుకి అరెకరామడి కలిసీదికాదు. మళ్ళీ కరంటు వచ్చినపుడు మద్దిరాతిర్ని ఎల్తే ఆమరకే కలిసేది. వలస రైతు నా పొలముకి ఎపుడు నీరిత్తాడా అని ఎదురు చూసోడ్ని. వలస రైతు పొలంకి నీరందక నానా అవస్థలు పడోడు. నాపొలంకి మరి బోరు నీరు ఇవ్వనేదు. అరిటి తోటంతా నులకుండ లాగ సుట్టుకు పోయింది. గాల్దేవుడు ఒక సంవత్సరము తినిత్తే గవర్నమెంటు రెండో సంవత్సరము నన్ను తినీసింది వలస రైతుకి అరిటిపోయిన మిగతా పంటలు కలిసొచ్చీవి.

మా అల్లుడు కూతుర్ని మా యింటికి పంపీసాడు. ఇచ్చిన కట్నం సాల్దని. డబ్బులు పట్టుకుని రమ్మని తోలీసాడు. అది నట్టింట్ల కూకొని ఏడుత్తంది. నాయాతన నాను పడతుంతే అల్లుడేమో ఇలగ సేసినాడు. ఈ బాదల్తోటి తలపట్టుకు కూకుంతే కునికి నక్క మీద తాటిపండు పడ్డట్టు మా బాబుకి బాగోనేదు. ఏటిసెయ్యాలో ఎలాగ సెయ్యాలో తెలీక తల బాదుకుంతన్నాను. ఆదమ్మవుంతే అన్నీ అదే సూసుకుండేది. నాకేటీ తెలీదు. నాకు నా పొలమే నోకము. పక్కూరు కూడా ఎపుడూ ఎళ్ళనేదు. గామంచా, బాడీ తప్ప లాల్చీ తొడగడము తెలీదు. అదిగదిగో మా యారకాడు కొడుక్కి పెళ్ళి అయ్యినపుడు ఎళ్ళాను. అపుడు ఏసుకున్నాను లాల్చీ.

ఆళ్ళ కాళ్ళు ఈళ కాళ్ళు పట్టుకుని బాబుని పట్నం ఆసుపత్రికి తీసుకెళ్ళాను. పట్నం వైద్యమంతే మాట్లేటి. ఏటిసెయ్యాలన్నా డబ్బుల్తోటి పని. అందరూ సెయ్యిసాపినోలే. మావూర్ల అప్పంతే కష్టమే. పూట బత్తింపుల్ల వెలుగు తిత్తవమా ఊరు రైతుల్ది. వలస రైతు దగ్గరికి పరిగెత్తాను.

బాబుని పట్నం ఆసుపత్రికి తీసుకెళ్ళాం డబ్బులుంతే ఇమ్మన్నాను. ఇపుడు కిపుడు ఎలాగవత్తాయి పొలం అమ్మెత్తానంతే ఎవులునైనా సూసి ఆళ చేత డబ్బులు ఇప్పించుతాను అన్నాడు.

ఏటిసెయ్యడము తెలీలేదు వలస రైతు ఇరకాటము పెట్టేసాడు. ముందుసేసిన అప్పువలస రైతుకివ్వాలి. బాబు పరిస్థితి సూత్తే బాగోనేదు. ఎలాగైనా బాబుని బతికించుకోవాలి. అదును సూసి దెబ్బ కొట్టాడు వలస రైతు. ఆడికుతంత్రము కనిపెట్టనేప్పొన్ను. అరిటి ఎయ్యమని సెప్పి మాకొంప ముంచాడు. అపుడు పొలం అమ్మనని కరాఖండీగా సెప్పినందుకు ఎపుడు దొరుకుతానని సూసినాడు.

మరేటిసెయ్యనేక పొలం అమ్మీడానికి ఊ... కొట్టీసాను. ఎలాగో బాబు బతికాడు పొలం పోయింది. మట్టిని నమ్ముకుని మన్ను తిని బతికినోడ్ని. అన్నీ పొలమే అనుకున్నాను. పొలం పక్కలెల్లి నడుత్తుంతే కళ్ళంట నెత్తురు పడతంది. ఎవులు దగ్గర మాట పడకుండా బతికాను. నా తండ్రి నాకిచ్చిన ఆస్తిని నాకొడుక్కినేనివ్వక పోన్ను. నా బతుకే పొలం. పొలం లేకుంట ఎలాగ బతకాలో తెలీలేదు. నా ఊపిరి పొలం. నాకే కుటుంబ బలము నేకపోయినా పొలమే నా బలమని బతికాను. యవసాయము తప్ప మరొక పని తెలీని నేను ఎక్కడకెళ్ళి ఏటి సెయ్యగల్ను పొలం నేని బతుకు ఎందుకనుకొన్నాను. అందుకే ఈ పనిసేసుకున్నాను.

సెప్పండి నాను సేసింది తప్పా ?

# మైదానంలోకి

మంత్రి కృష్ణమోహన్
9441028186

మైదానం సందడి సందడిగా ఉంది
బడిపిల్లల అల్లరి కేరింతలతో
నిండుగా బహు పరవశంగా ఉంది
ఇవాళ మళ్ళీ, పిల్లలతో పెద్దలు
కలగలిసిన వేదికకు భూమికగా ఉంది



ఇప్పటి దాకా
తరగతి గదుల్లో హుంకరించిన వాళ్ళు
మైదానం చేరి పిల్లలైపోయారు
పాఠాల్లో ఈదిఈది మునగడమూ
ఆటల్లో మునిగి మునిగి తేలడమూ
తమదైన తన్మయ వైభవలోకంలోకి
సాదరంగా నిర్మలంగా ఆహ్వానించడమూ
అయ్యారే పిల్లలు, పిడుగులు !
గురువులకు ఉపాధ్యాయులు !

* * *

కసిరిన పెద్దల కారు పెదాలపైన
కనకాంబరాలు పూస్తున్నాయి
పొడిపొడి దేహాలు
తడితడిగా కాంతులీనుతున్నాయి
మైదానం చేరిన పిల్లగాలులు
ఈల పరిమళాలు వీస్తున్నాయి
ప్రేక్షక కుతూహాలై ఉత్సుకనేత్రాలై
పిల్లలూ, పిట్టలూ-
నా బాల్యపు లేత దృశ్యాలు
కొత్త రంగుల్లో కనబడుతున్నాయి
ఈ జీవనోల్లాస సంబరంలోకి
మీకూ స్వాగతం !
మనిషికి మనిషి మరింత దగ్గరయి హత్తుకునే
ఉత్సవ ప్రాంగణం కదా ఇది !
ఇక్కడ అన్ని భారాలు తేలికవుతాయి
అన్ని భయాలు పారిపోతాయి
కాలాలు మళ్ళీ వెనక్కి నడుస్తాయి !
ఇక్కడ ఏ వ్యాపార ప్రపంచపు ఆనవాళ్ళు లేవు
ఏ ప్రచారార్భాట పటాటోపాలు లేవు
హోదాల్లేవు- దర్పాల్లేవు - ఎక్కువ తక్కువ లసలే లేవు
ఇక్కడందరూ ఆటగాళ్ళే - సరి సావాసగాళ్ళే -
క్షణం ఆనందం ! క్షణం ఉత్తేజం ! క్షణం నిర్వేదం !
క్షణం గెలుపు ! క్షణం ఓటమి ! క్షణం మలుపు !
మైదానమూ తరగతి గదే, విశాల జీవన శాలే !

* * *

విశాలమూ సమూహమూ కానిచోట
ఎవరుమాత్రం ఏం నేర్చుకుంటారు
ఏ ప్రేమ సాన్నిహిత్యమూ పొంగిపొర్లని చోట
ఎవరు మాత్రం ఏం తీసుకుంటారు
ఏ పువ్వుపూయని చోట ఓ పక్షి ఎగరనిచోట
ఏ ఉద్వేగ ప్రపంచపు తడి స్పర్శా తాకని చోట
ఎవరికి మాత్రం
ఏ జీవన సౌందర్య సరళ రహస్యం బోధపడుతుంది
ఏ స్వేచ్ఛా ద్వారాలు లేని తరగతి గదులు నాకొద్దు
ఏ ఆటపాటలు ఆరామాలు లేని పాఠశాలలు నాకొద్దు
యాంత్రిక చదువుల బందిఖానాలు కూల్చి
పచ్చని పచ్చిక బయళ్ళు నాటండి
బడిని, భయ కర్మాగారం కాదు
దర్శనీయ జీవనమైదానం చేయండి.

# మొరసునాడు కథల్లో కన్నడ సొబగులు

వి. ప్రతిమ
9848541485




స. వెం రమేష్‌ని మనం చాలా వాటికి అభినందించాలి. అమ్మ భాష కోసం, పొరుగు తెలుగు కోసం, అంతరించిపోతోన్న జాతుల కోసం, కనుమరుగయిపోతోన్న పదాల కోసం అన్వేషణ సాగిస్తోన్న నిరంతర సంచారి అతడు. ఆ క్రమంలో అవసరమైతే ఎంతటి వారితోనయినా 'ఢీ' కొనడానికి వెనుకాడని ధీశాలి కూడ...

ఇప్పుడు ముక్కలయిపోయిన మూడు తావుల బతుకుల్ని ఏర్చి కూర్చి 'మొరసునాడు కథలు'గా మన ముందుకు తెచ్చినందుకు అతడికి మరోసారి మనం మప్పిదాలు తెలుపుకోవాలి.. ఈ ప్రయత్నంలో వితడికి సహకరించిన ప్రముఖ కన్నడ రచయిత స. రఘునాధ గారికి, అద్భుతంగా కన్నడ కథల్ని అనువదించి అందించిన నంద్యాల నారాయణ రెడ్డి గారికి కృష్ణరసం రచయితలకు తెలుగు పాఠకులంతా ధన్యవాదాలు, అభినందనలు చెప్పుకోవాలి.

ఈ పుస్తకంలో పది తెలుగు కథలు, పది కన్నడ కథలు, తమిళ ప్రాంతపు తెలుగువారు రాసిన మరో పది తెలుగు కథలు వున్నప్పటికి ఈ పుస్తకంలోని కన్నడ కథలు మాత్రమే నా సమీక్షా పరిమితి.

నేనెప్పుడూ అనుకుంటూ వుంటాను ఒక శ్రీశ్రీ, ఒక గురజాడ, ఒక చలం, ఒక కుటుంబరావు వీళ్ళంతా తెలుగు పాఠకులకి మాత్రమే స్వంతం. తెలుగు భాషకి వాళ్ళు పెన్నిధి వంటివారు, మరే యితర భారతీయ భాషల్లోనూ శ్రీశ్రీ లేదు, చలం లేదు. అని గర్వంగా వుంటుంది నాకు...

అయితే కన్నడ భాషల మాస్తి వెంకటేశ అయ్యంగారి గురించి 'మాస్తి కన్నడిగుల ఆస్తి' అనుకుంటారని తెలిసినపుడు' అరెౕ నిజమే కదా ఏ భాషా సాహిత్యంలోనయినా వారి వారికి కొన్ని పెన్నిధులుంటాయి కదా అన్పించింది.. ఇందులోని మాస్తి కథ చదివాక ఆ విషయం మరింత స్పష్టమైంది...

ఈ సంకలనంలో మాస్తి వెంకటేశ అయ్యంగారి "వెంకటగాని పెండ్లాము" అన్న కథ వస్తుపరంగా గొప్ప కథ అందులో సందేహం లేదు.

1947 ప్రాంతంలో, తనని కాదని ఒక పెద్ద రెడ్డికి రెండో పెళ్ళాంగా వెళ్ళిపోయిన తన భార్య గురించి యివ్వాళ కాదు రేపయినా, ఎల్లుండయినా, లేదా మరో జన్మలోనయినా సరే తన దగ్గరకి వచ్చి తీరుతుందనీ తీరుమానం చేసుకుని ఎదురుచూసిన వెంకటయ్య కథ యిది... వస్తువు, ఎత్తుగడ, ముగింపు, కథ నడిపిన తీరు యిదంతా ఒక ఎత్తయితే, ఈ కథలోని వాతావరణ చిత్రణ మరో ఎత్తు... కథ ఎక్కడో మొదలవుతుంది. ఇవన్నీ ఏమిటి? నేరుగా వెంకటయ్య కథలోకి ఎందుకు వెళ్ళలేదు రచయిత అనుకుంటాడు పాఠకుడు. కథ ముగింపుని ఈ ప్రారంభంతో ముడిపెట్టి పాఠకుడి కళ్ళముందు ఆవిష్కరిస్తాడు రచయిత. పూర్తిగా శిధిలమైపోయిన తర్వాత కూడ కళగా, పచ్చగా కన్పిస్తోన్న ఆ పాతవూరినీ, ఆకులన్నీ రాలిపోయినా కొమ్మ కొమ్మకీ చివరన విరగబూసి నవ్వులు చిందిస్తోన్న ఆ దేవగన్నేరు చెట్టునీ ప్రతీకలుగా తీసుకుని వెంకటయ్య కథని చెప్తాడు రచయిత... ఇంత విషాద భరితమైన కథని వెనకుంచుకుని అంత మామూలుగా ఎలా వుండగలుగుతున్నాడు వెంకటయ్య అన్నది ఆశ్చర్యకరం...

ఇదంతా అలా వుంటే ఈ వాతావరణ చిత్రణ చూడండి. "మాను కొమ్మపైన గద్ద ఒకటి కూచుని తన ముక్కుతో రెక్కలను సవురుకుంటున్నది... మిన్ను తేట నీలంతో బోర్లించిన బాన లాగా వుంది... మొయిళ్ళు బొత్తిగా లేవు... వెడల్పుగా పరుచుకున్న ఆ బట్టబయలులో ఒక పక్షి రెక్కలను బార చాచి ఎగరతా వుంది.

అంతదూరం లోని ఆ పక్షి దగ్గరకు వస్తావుంటే పొద్దు వెలుగుదాని రెక్కల్లోకి దూరి దాని వన్నెను చూపిస్తావుంది.... మెరిసే అపరంజి వన్నె వలన అది గరుడ పక్షి అని తేలిపోయింది" అంటాడు. నిజంగా ఎంతో లోతయిన పరిశీలన వుంటేనే తప్ప యిటువంటి చిత్రణ చేయడం సాధ్యం కాదు. తెలుగులో పెద్దిభొట్ల సుబ్బరామయ్య గారి కథల్లో యిటువంటి వాతావరణ చిత్రణ మనం చూడవచ్చు. మాతృభాష తమిళం అయినప్పటికీ కన్నడ సాహితీ క్షేత్రంకు "కథా బ్రహ్మ"గా పేరొందిన వీరి చికవీర రాజేంద్ర నవలకు ప్రతిష్టాత్మకమైన జ్ఞాన పీఠ పురస్కారాన్ని అందుకోవడం విశేషం.

ఇంకా అంతకు ముందే 1945లో కె.వి. అయ్యర్ రాసిన కథ ఒకటి యిందులో వుంది..." ఇంటి ముందరి పిల్లలు".

అర్థం, పర్థం లేని ఆచారాలు, మడి, తడి, ముట్టు, శుద్ధి వంటి వాటిని అత్యంత మృదువైన వ్యంగ్యంతో ఎండగట్టిన కథ యిది.... చిత్ర మేమిటంటే ఈ కథ చెప్పే కథకుడు కూడ అదే సామాజిక వర్గానికి

చెందిన వాడయినప్పటికీ తమ కులంలోని అంటు, ముట్టు, శుద్ధి వంటి వాటిని పాటించడంలో రిజిడ్‌గా వుండి నగరంలో అది సాధ్యం కాక పల్లెకి పారిపోయిన భావోజీని రచయిత ఎంత సహజంగా పరిచయం చేస్తాడంటే ఒక అగ్రహారం అందులో ఈ కథకుడి యింటి ఎదురుగా వున్న ఆ భావోజీ కుటుంబం... పొట్టిగా వొంగి ధోవతి మాత్రం ధరించి బావినీళ్ళ కోసం ఎదురింటికి వస్తూ వస్తూ అశుద్ధాన్ని తొక్కి తెరువంతటినీ తిట్లతో తూర్పార పట్టే ఆ భావోజీని మన కళ్ళ ముందు అట్లా నిలబెడతాడు రచయిత.

చాల విభ్రమ కలిగించే విషయం ఏమిటంటే వస్తువు సంగతెలా వున్నా ఆ శిల్పం, శైలి, దృష్టికోణం వంటి కథకు సంబంధించిన వ్యాకరణ సూత్రాలన్నింటినీ ఆనాటికే కన్నడ రచయితలు పాటించివుండడం.

ఇందులో మన తెలుగు వాళ్ళకి బాగా పరిచయమైన స్నేహశీలి అయిన లోతైన రచయిత ఒకరున్నారు. వారు స.రఘునాథ. ఆయన్ని మనమంతా తెలుగన్నడ రచయిత అని పిలుచుకుంటాం. తెలుగులోనూ, కన్నడంలోనూ రచనలు చేయడమే కాకుండా తెలుగులో నుండి కన్నడంలోకి, కన్నడంలో నుండి తెలుగులోకి అనేక అనువాదాలు చేస్తూ అత్యంత విలువైన సాహితీ సేవ చేస్తూ వస్తున్నారాయన.

ఇప్పటి వరకూ ఆరు కవిత్వ సంపుటాలు, రెండు విమర్శనా గ్రంథాలు, బాలగీతాల పుస్తకాలు రెండు, అనువాదాలు ఎన్నో... "తంగేడుపువ్వు" అన్న కథా సంకలనం వెలువడ్డాయి... తమాషా ఏమిటంటే వారి మాతృభాష కన్నడమయినప్పటికీ తెలుగు రచనల్లో కన్నడ సొబగులూ, కన్నడ రచనల్లో తెలుగు సంస్కృతి కలగలసిపోయి పాఠకులకు హృదయవిందు కలిగిస్తుంది. కేవలం రచనలే కాకుండా అనేకానేక సామాజిక కార్యక్రమాల్లో స్వచ్ఛందంగా పాల్గొనడం వీరి ప్రత్యేకత.

వీరి "యాది పండగ సంత చేసింది" అన్న కథ శీర్షిక చూడగానే వారాల కృష్ణమూర్తి కథ 'యాది' గుర్తొస్తుంది మనకి. ఆ యాది లాగే ఈ యాది కూడ చాల రోజుల దాకా పాఠకుడి జ్ఞాపకాలలో సుళ్ళు తిరుగుతూనే వుంటుంది... అట్టడుగులో అట్టడుగు వర్గంలోని యాది చేతులకు గాజులు వేయించుకోవడం కోసం అయిదు రూపాయలు కూడేసుకుని దాన్ని భర్తకు తెలీకుండా దాచి పెట్టుకోవడానికి చోటు కానక ఆమె తికమక పడే విధానం... రెడ్డి భార్యని మీరు డబ్బులు ఎక్కడ దాచి పెట్టుకుంటారు అని అమాయకంగా అడగడం.. చివరికి అమాయకమైన యాది ఒక ఎత్తేసి భర్తనడిగి డబ్బు తీసుకుని పండగ సంత చేసుకోవడం యివన్నీ అత్యంత సాధారణంగా చెప్పుకుంటూ వెళ్ళడం... పాఠకుణ్ని హాయిగా చదివింప చేస్తుందీ కథ.

ఈ పది కథల్లోనూ ఒకే ఒక్క స్త్రీ రచయిత మనకనిపిస్తారు. ఆమె కె.ఆర్ సంధ్యారెడ్డి... ఈమె మాతృభాష తెలుగు. అయినా కన్నడంలో గొప్ప రచయిత్రిగా పేరు తెచ్చుకున్నారు. ఆమె రాసిన 'బేరొందుదారి' అన్న కథా సంపుటి కన్నడ పాఠకుల హృదయాల్లో సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్నది. కన్నడ సాహిత్య పరిషత్, ఎథిక్ సొసైటీ, గోరూరు ప్రతిష్టాన, జానపద ప్రశస్తి వంటి ఎన్నో పురస్కారాలనందుకున్న సంధ్యారెడ్డి గారు సాహిత్యానికే కాకుండా ఎన్నో జానపద, యక్షగాన సంస్థలకు కూడ తమ సేవలందించారు. ప్రస్తుతం కర్నాటక రచయిత్రుల సంఘానికి అధ్యక్షులుగా వున్నారు.

వీరు రాసిన "అమ్మకొకచీర" ఈ కథా సంకలనంలో చేర్చబడింది. అత్యంత సాధారణమైన పదాలతో ఏమాత్రం క్లిష్టం కాని శైలితో చాల విలువైన విషయాన్ని బలంగా చెప్పారీమె.. ఈ కథ చదూతున్నపుడు మనకి తెలుగులో లక్ష్మీపతి రాసిన 'జీవన్మృతుడు" అంతకు చాలా కాలం ముందు మధురాంతకం రాజారాం రాసిన 'ఎడారికోయిల' కథలు దృష్టిపథంలో నిలుస్తాయి... నిస్సందేహంగా ఈ రెండు కథల స్థాయిలో వున్న కథ "అమ్మకోచీర".

భార్యాభర్త లిరువురూ కూతురు చిత్రతో కలిసి బెంగుళూరు నుండి వూరికి బయల్దేరడంతో కథ ప్రారంభమవుతుంది... మొదట్లో తరచుగా వెళ్తూండినా క్రమక్రమంగా ఇల్లు కట్టుకున్న అప్పులు తీర్చడంలో వూరికి వెళ్ళడమనేది వృథా ఖర్చుగా మారిపోతుంది... చాలా రోజుల తర్వాత ఊరికి బయల్దేరారు ఉమ, రాజన్న...

ఆ ప్రయాణంలో వారిరువురి ఆలోచనలలో నుండి ఊరి విశేషాలన్నీ మనకి అర్థమయ్యే చిత్రణ జరుగుతుంది... ఉద్యోగం మూలంగా రాజన్న కుటుంబానికి పుట్టిన రోజుకో, పెళ్ళి రోజుకో పండక్కో పబ్బానికో కొత్తబట్టలు కొనుక్కునే అవకాశముంది.. చిన్నదో, పెద్దదో ఇల్లు కట్టుకుని సుఖపడడం వుంది.... అయినా ఉమకి కొరతే... నలుగురి లాగా తాను విలువయిన చీరలూ, నగలూ కొనుక్కోవడం లేదని వేదన.

అయితే ఊరి వద్ద వున్న రాజన్న తల్లిదండ్రులకు గానీ అన్న వదినలు కూతురు సరసకి గానీ ఒళ్ళు దాచుకోడానిక్కూడ సరయిన బట్టలుండవు.. వ్యవసాయం దెబ్బతిని అత్యంత పేదరికంలో వుంటారు. తల్లికి ఒక కన్ను కన్పించదు. భర్త వల్ల ఆమె ఏనాడూ సుఖపడింది లేదు... దుర్భర దారిద్ర్యంతో పాటు భర్త నిర్లక్ష్యం, తన్నులు, గాయాలతోనే జీవితం మునిమాపు కొచ్చేసింది... వదిన చెవుల్లో ఎప్పుడూ మెరుస్తుండిన మాటీలు ఈసారి కన్పించలేదు రాజన్నకి...

అయినా కుటుంబ సభ్యులంతా కూడ చాలా ప్రేమతో రాజన్న కుటుంబాన్ని ఆదరించి విందు భోజనం పెడతారు. మర్నాడు వీళ్ళు బయల్దేరుతున్నపుడు వీరి కుటుంబానికి రెండు మూడు నెలలకు సరిపడేలా బియ్యమూ, బెల్లమూ, చింతపండూ మిరపకాయలూ పప్పులూ, గింజలూ అన్నీ మూటలు కట్టి యిస్తుంది వదిన... వాకిట్లో పెరిగిన మల్లెతీగ మొగ్గలతో మాల కట్టియిస్తుంది సరస... రాజన్న తండ్రి కరివేపాకును కోసి కట్టకట్టి తెచ్చి కూరగాయల సంచిలో పెడతాడు. తల్లి మంచం మీది నుండే "యింకేం కావాలో అడిగి తీసుకోమ్మా.. ఏమేమి మరిచిపోయారో చూడు" అంటూ ఉమకి సూచన యిస్తుంది.

అసలైన మనుషులెవరో అర్థమై చదువుతున్న పాఠకుడి గుండె ఆర్ద్రతలో నిండిపోతుంది... ఇదంతా అలా వుంటే బయల్దేరుతున్నపుడు ప్రతీసారీ లాగే రాజన్న తండ్రికి చిల్లర ఖర్చుల కోసం ఇరవై అయిదు రూపాయలిస్తాడు... అలాగే తల్లి దగ్గరి కెళ్ళి డబ్బులివ్వబోతే తల్లి వారిస్తూ తన దగ్గరున్న వక్కాకు తిత్తిలోని మెత్తబడిపోయిన ఐదు, పది రూపాయల నోట్లను తీసి కొడుకు చేతిలో వుంచుతుంది. "ఈ డబ్బులన్నీ

అప్పుడప్పుడూ నువ్విచ్చినవేరా... చూడు వున్న ఒక్క చీరా తుక్కు తుక్కయిపోయింది.. కట్టుడానిక్కాడ వీల్లేదు" అంటుంది.

రాజన్నతో పాటు చదువుతున్న పాఠకుడికి కూడా క్షణ కాలం ఊపిరి నిలిచిపోతుంది... కథ పూర్తయ్యేటప్పటికి తడి కళ్ళను మూసుకుని మౌనంగా వుండిపోతాం మనం.

ఇంకా యిందులో ఒక ఆదర్శ భావాలున్న యువకుడి జీవితానికి ఏది పోటీస్తే ఎలా వుంటుందో పరిణామాలని సూచిస్తూ అత్యంత సహజంగా రెండురకాల ముగింపులని జోడించిన వినూత్నమైన కథ "నేను చంపినయువకుడు" బి.ఆర్. లక్ష్మణరావు రాసింది... కన్నడ సాహిత్య అకాడమీ పురస్కారం నుండి అనేక పురస్కారాల నందుకున్న ఈ రచయిత కథలు తెలుగులో లభిస్తే బావుండునన్పిస్తుంది కథ పూర్తయ్యేటప్పటికి... టెక్నిక్‌లో కొత్తదనం మనని ఆకర్షిస్తుంది...

శిల్పంలో కొత్తదనం అనుకోగానే మరో కథ జ్ఞప్తికొస్తుంది. ఇందులో మనని చాలా అలజడికి గురి చేసి ఆలోచనలో పడవేసే మరో కథ "శబ్దాల వెలుగులో"... 'ప్రజావాణి' అన్న కన్నడ పత్రికలో విలేఖరిగా పనిచేస్తోన్న కె. నరసింహమూర్తి అన్న యువ రచయిత రాసిన కథ యిది... ఇవాళ అమ్మమ్మ, నానమ్మ, తాతయ్యలు లేని న్యూక్లియార్ కుటుంబాలలోని ఒక పిల్లవాడు తన గుండెల్లోని శబ్దాలన్నింటినీ పిండి నానమ్మ ముందు పరచడమే ఈ కథ....

తెలుగులో ఈ వస్తువుతో యింత అద్భుతమైన కథ యింత వరకూ రాలేదేమోనని పదే పదే అన్పించింది చదువుతున్నపుడు.. ఇది కేవలం అవ్వ, తాతలకు మాత్రమే సంబంధించిన కథ కాదు నిజానికి కుటుంబానికి సంబంధించిన, సమాజానికి సంబంధించిన అనేకానేక విషయాలను గురించి ప్రస్తావిస్తూ మొత్తంగా మానవ సంబంధాలను గురించి నిలువెత్తు ప్రశ్నలై సమాజాన్ని నిలదీసిన కథ యిది.

"అసలీ కాలంలో మనవళ్ళు లేరనేది జగమెరిగిన నిక్కం" అంటూ ప్రకటిస్తారు రచయిత..."పొద్దు పోకడకూ, మాటకూ, కథకూ యింకొకరి యింటి పంచను తొంగి చూడకుండా మన మన ఇళ్ళలోనే తొంగి చూసుకుంటే, ఎదను తెరిచి పరుగులు తీయకుండా ఎన్నెన్ని కతలనీ.. కొడుకులూ, మనవళ్ళూ కూడ. పిండ దశలోనే పోలియో తగిలి పెళ్ళి కాకుండా ఊరకే కూచున్న బొమ్మలు ఎవరో తొక్కిన ముగ్గుల్లాగా కనపడతాయి కదా అవ్వా" అంటాడు. ఈ కథ ఎవరికి వాళ్ళు చదివి అనుభూతించాల్సిందే తప్ప చెప్పనలవి కాదు.

ఈ రోజున ప్రజల జీవనాలను సమాధి చేస్తూ అభివృద్ధి అనే అందమైన భ్రాంతిని చూపించడం పాలక వర్గానికి అలవాటయిన సందర్భంలో వున్నాం మనం.. సెజ్‌ల రూపంలో ప్రభుత్వం ఎట్లా పేద రైతుల భూమిని ఆక్రమించుకుని మీకు ఉద్యోగాలు కల్పిస్తాం, ఆర్థిక పరిస్థితి మెరుగు పరుస్తాం, పరిశ్రమలు ఏర్పాటు చేస్తాం అంటూ వారు చూపించిన కలలు కల్లలయిపోయి, చేతిలో కొచ్చిన నోట్ల కట్టలు మంచి నీళ్ళలా కారిపోయి, భూమి లేకుండా పోయి, చేసేదానికి పనిలేక సన్నకారు రైతులంతా రైతు కూలీలుగా మారి చివరకు ఎట్లా ఆత్మహత్యల అంచులకు నెట్టబడ్డారో మనకి తెలుసు.. ఆంధ్రలో పోలేపల్లి వంటి చోట్ల 45 మంది రైతులు ఒక్కసారిగా గుండె ఆగి మరణించడాన్ని గురించి విని మనం కదిలిపోయాం.. ఇదంతా అలా వుంటే మనిషి చచ్చిపోతే పూడ్చి పెట్టడానికి కూడ చోటు లేకుండా ఎట్లా కంచెలు కట్టేశారో కూడ తెలిసిన విషయమే...

ఈ నేపథ్యంలో నుండి డా॥ జె. బాలకృష్ణ రాసిన "బి.డి.ఎ వెలినెలవు మరియు చిక్క తాయమ్మ నేల" అన్న కథ వుంది. "మన నేలని ప్రభుత్వం ఎందుకు తీసుకుంటాది? మన మెందుకిస్తాం?" అంటూ రచ్చ రచ్చ చేసేస్తుంది చిక్క తాయమ్మ... తన కొడుకు సొంత ఆటో కొనుక్కోడానికని ఒక అరెకరా నేల అమ్మకానికి కూడ ఏ మాత్రం ఒప్పుకోని చిక్కతాయమ్మ ప్రభుత్వం తమ నేలని తను అంగీకారం లేకపోయినా స్వాధీన పరుచుకుందని విని కృంగిపోతుంది. అసలే ఆమె ఆరోగ్యం బాగోలేదు.. బిడ్డ సంచిలో పుట్ట కురుపుందని కిద్వాయి ఆస్పత్రిలో చూపించి ఎన్నో మందులూ, ట్రీట్‌మెంట్లూ అయి లాభం లేదని యింటికి తీసుకొచ్చేశాడు తమ్మయ్య.. ఆమె రక్తపు గుడ్డలన్నీ రాత్రివేళ ఉతికి ఆరేసే తమ్మయ్య... ఒకరోజు భార్య కోరిక మీద తనని పూడ్చి పెట్టడానికి జానెడు నేల ఉందో లేదో చూసి రమ్మంటే బయల్దేరతాడు. రోజంతా తిరిగి తిరిగి మినుచితి (క్రిమిటోరియం)లో శవాలు క్షణ కాలంలో కాలి కమురు వాసన కొట్టడాన్ని చూసి వికలమై తిరిగివస్తాడు.

చిక్కతాయమ్మకి జబ్బు చేసినప్పట్నుండీ పొలానికి వెళ్ళలేదు. కొడుకు ఆటో ఎక్కి భర్త సాయంతో తన తల్లిదండ్రుల బొందలు చూడ్డానికి బయల్దేరుతుందామె...నేలలోని సారవంతమైన మట్టిని పొట్టలోని పేగులను లాగినట్టు బయటికి లాగి బాటలూ, కాలవలుగా చేసేసినారు... వాటిల్లో తన ఇల్లూ, అమ్మా అబ్బలు బొందిలూ అన్నీ మునిగి పోతున్నట్లుగా అన్పించాయి చిక్కతాయమ్మకు.. వెలినెలవులు (లే అవుట్లు)గా మారిపోతున్న పంటపొలాలన్నీ వల్లకాడుగా కన్పించసాగాయి. అంటూ ముగుస్తుందా కథ.

ఇవాళ రాజ్యం చేస్తోన్న అనేక రకాల కుట్రల్లో ఈ అభివృద్ధి కూడ ఒక కుట్ర అన్న విషయాన్ని బయటపెడుతుందీ కథ...ఎంత ఉన్నత చదువులు చదివినప్పటికీ, ఎంతెంత పెద్ద ఉద్యోగాలు వెలగబెడ్తున్నప్పటికీ స్త్రీల పట్ల ఏమాత్రం మారని మగ దురహంకారాన్ని మెత్త మెత్తగానే చీల్చి చెండాడిన కథ "ఎదగలేనివారు"... మాలూరు వెంకటస్వామి రాసిన కథ.. సగటు మగ మనస్తత్వాన్ని రచయిత ఎత్తిచూపిన తీరు చెప్పుకోదగినది. ఉత్తమ పురుషలో సాగి, రచయిత స్త్రీల పక్షాన నిలబడిన విషయాన్ని స్పష్టం చేస్తుంది....

ఇంకా ఇందులో ఆర్. విజయరాఘవన్ రాసిన 'తనిఖీ' కె.ఎన్ గణేశయ్య రాసిన 'రగిలినపేగు' కథలు కూడ చెప్పుకోదగినవే. గణేశయ్య కోలారు జిల్లా కోటిగాన హళ్ళిలో పుట్టారు. ఈ 'కోటిగానహళ్ళి' అన్న పేరు ఆ గ్రామానికి ఎలా వచ్చింది, అది క్రమంగా తెలుగు ప్రభావంతో, కోటి గాని పల్లి గామారడం... ఆ పేరు రావడానికి వెనక అందరూ చెప్పుకునే మహిమ కాకుండా ఒక నిజమైన కథని ఈ కథకుడు వెదుక్కుంటూ వెళ్ళడం.. ఆ కథ చెప్పిన భజన వెంకటప్ప కొన్నాళ్ళకే చనిపోవడం... నిజానికి ఆ కథని భజన వెంకటప్పకు చెప్పిన ఆయన తండ్రి కూడ కథ చెప్పిన కొన్నాళ్ళకే చనిపోవడం.. మరి యిప్పుడు ఈ

## కవిత

# మరణాన్ని ఓడించిన మనిషి

- వల్లభాపురం జనార్దన
9440163687

మనిషి
మానవతా కిరీటం ధరించిన మనీషి
మన సంక్షేమానికి ఊపిరిపోసిన మనిషి
మరణాన్ని ఓడించిన మనిషి!
మానవుడై - శ్రామికుడై
సామాన్యుడై - సైనికుడై
దార్శనికుడై - మేధావియై - సేనానియై
ప్రపంచాన్ని మలుపు తిప్పడానికి
మట్టిని ముద్దాడిన వాడు
మనిషిని మరిచిపోకుండా
జీవితాన్ని ప్రేమించినవాడు
ఆశయాల జలపాతాలను దూకించి
కన్నీటి - దోపిడీ సముద్రాల
లవణీయతను కరిగించడానికి
రసాయనప్రయోగం చేసినవాడు
శాంతి దీపంతో విప్లవ దీపానికి
వత్తిగా మారినవాడు
గ్రీష్మ కిరణాలను వెన్నెల కిరణాలుగా
ప్రసరింపజేయడానికి
మార్పు ప్రణాళికను అమలుచేసినవాడు
ఎండిన వసంతఋతువును
ఇంద్రధనుస్సు రంగులుగా పండించి
ఎర్రమల్లెల పరిమళాలను
ప్రవహింపజేసినవాడు
ఆకుపచ్చ విప్లవాన్ని ఆపటం కోసం
మరణం దాడిచేసి శరీరాన్ని మాయం చేసినా
అతడు మరణించని మనిషి
మరణాన్ని ఓడించిన మనిషి



# అమరుడా...! అజేయుడా...!!

పి. గోపీనాథ్
9440572989

వెనిజులా వీరుడా...!
నీ బోటి వాళ్ళెప్పుడూ ఇంతే
అన్యాయాన్ని ధిక్కరించే
ప్రశ్నల అస్త్రాలై పుట్టి
ప్రపంచమంతా విస్తరించి
ప్రజాగ్రహాన్ని వెలిగించే
దివిటీలై నిలుస్తారు
వేటగాళ్ళు విసిరే సవాళ్ళ వలలను
ధ్వంసం చేసేందుకు
ఉరితాళ్ళనైనా ఉత్సాహంగా కౌగిలిస్తారు
పిశాచాలు పేల్చిన ఫిరంగులు వెదజల్లే
గంధక ధూమాన్ని అసహ్యించుకుని
దారుణంగా కాలి బూడిదైన దేహాల
కమురు వాసనను తలచుకొని
కన్నీరు పెడుతుంటారు
ఏకధ్రువ ప్రపంచ సింహాసనంపై కూర్చుని
అరాచకం సృష్టిస్తున్న
ఇనుపగోళ్ళ గ్రద్ద బెదిరింపులకు లొంగక
ఎదురు తిరిగే కపోత వీరులై
ఉద్యమాల కత్తులతో కొత్తధ్రువాన్ని నిర్మించాలంటారు
రెక్కలు విరిచే గాయాలను సైతం లెక్కచేయక
గిజిగాళ్ళ దండును కట్టి ముందుకు నడిపే
రక్తవర్ణ యోధులు మీరు
అందుకే... మీకు మరణం లేదు
మీ ఆశయాలకు అలసట లేదు
బొలివరీయుడా! అజేయుడా!!
సామ్యవాద పిపాసీ...
సామాన్యజన హృదయ నివాసీ...
హ్యూగో చావెజ్! నీవు అమరుడవు!!

కథను రాస్తున్న కథకుడి పరిస్థితేమిటి?... బెదురుపుట్టి చించి పారేస్తాడతడు. ఒకవేళ ఈ కథ ముసుముందు ఎవరికయినా దొరికితే అది ఆ దేవత (పాలుక్కమ్మ) మహిమవల్లనే కానీ అని మౌనంగా వుండిపోయాడు. ఇది పైకి నెగిటివ్ ముగింపులా అన్పించినప్పటికీ ఆ కథని మనకి అందించినా రచయిత గణేశయ్య పాజిటివ్ గానే వుండడం విశేషం.

'తనిఖీ' కథ కూడ యిదే కోవలో మూఢ నమ్మకాలతో నిండి మహిమున్న ఒకానొక గుడిని గురించి ఒక అనామకుడు రాసిన అర్జీని పరిశీలించమని ప్రధానమంత్రి నుండి ముఖ్యమంత్రికి అక్కడ్నుండి ఆ ప్రాంత అధికారికి వర్తమానమందుతుంది.... దాన్ని తనిఖీ చేయడం కోసం ఆ వూరికొచ్చిన అధికారి వెంకటాచారికి ఎదురయిన అనుభవమే 'తనిఖీ'.... దాంతో అసలు విషయమేమిటో పాఠకుడికి తేట తెల్లమై పోతుంది... ఈ కథలోని వాతావరణ చిత్రణ పాఠకుడిని అలరిస్తుంది..

విజయ రాఘవన్ గారు కన్నడంలో కవిత, కథ, నవల, అనువాదం, ప్రబంధం మొదలైన ప్రక్రియల్లో యిప్పటివరకూ 19 కృతులను ప్రచురించడమే కాకుండా ఆంగ్లంలో ఒక నవల రాసి వుండడం విశేషం.

అన్ని కథలను గురించి చెప్పుకోవడం సాధ్యం కాదు కాబట్టి కొన్ని కథలను పాయింటు మాత్రమే చెప్పి వొదిలి పెట్టడమైంది. ఏది ఏమయినా ఈ కథలన్నింటినీ తేలికయిన చక్కటి అనువాదంతో తెలుగు పాఠకుల కందించిన నంద్యాల నారాయణరెడ్డి గారినీ, నరసింహమూర్తి గారినీ, సంపాదకత్వం వహించిన స.వెం రమేశ్‌నీ సం. రఘునాథగారినీ అభినందించాల్సి వుంది.



# జీవ అనాథ ప్రపంచం అనబడు Bio di (e) versity

కర్లపాలెం భాస్కరరావు
9949122113



కొందరు ఆశావహులు -
నాగళ్ళు భుజానికెత్తుకుని
ఆకాశంలో మబ్బులకేసి చూస్తుంటారు
వారిని భూమి మింగేస్తుంది.
ఇంకొందరు నిరాశోపహతులు -
పనిముట్లు కవచకుండలాలుగా చేసుకుని,
ఫ్యాక్టరీ గేట్ల ముందు, అద్దాలలో
నిలువు కాళ్ళజపం చేస్తుంటారు
వారి జీవితాలను యంత్రాలు మింగేస్తుంటాయి
మరికొందరు మధ్యతరగతి మందభాగ్యులు -
కార్యాలయాలలో కలాలతో కుస్తీ పడుతుంటారు
ప్రమోషన్ల ఎండమావులు వెనుక అలుపెరగక పరుగెడుతుంటారు
చివరికి ఇల్లలికిన ఈగలుగా మిగులుతారు
బూర్జువావర్గపు పూజారులింకొందరు -
తలక్రిందులుగావున్న ప్రపంచాన్ని
శీర్షాసనంవేసుకుని చూస్తూ
అంతా బహుభేష్ గున్నదని అంటారు
సార్వభౌమత్వ దేశంలో బహుళ జాతి కంపెనీలకు కోవర్టులు వీళ్ళు.
అసహన జీవులు మరికొందరు -
తుపాకులు చేతబట్టి
అడవుల్లో కడవల కొద్ది రక్తాన్ని పారిస్తారు
ఎప్పుడూ శత్రుపక్షానికి పావుల్లాగా ఉపయోగపడుతుంటారు
అసంతృప్తి జీవులింకొందరు -
చెట్టులోని కొమ్మకొమ్మకు, రెమ్మరెమ్మకు పేర్లుపెట్టి
జనవిభజనతో రాటుతేల్తారు
కుక్కతోక పట్టి గోదావరి ఈదుతామంటారు
ఇక నిబద్ధ జీవులు కొందరు -
ఈ అసంబద్ధ లోకాన్ని తగలేసి
మరో ప్రపంచపు మహాసృష్టికి
నిత్య ప్రస్థానం చేస్తుంటారు
మార్గదర్శకులుగా నిలుస్తారు.

---

# తొలి కవిత

జంకె కృష్ణారెడ్డి
9652222051

చుక్కలన్నింటినీ పోగేసుకొని చందమామ
విశ్వవిజ్ఞానాన్ని వెదజల్లినవేళ
తొలికవిత రాయాలనే కోరిక మొగ్గతొడిగింది
'వాడని' పూలతో మాలలు అల్లి
చదువుల తల్లికి అలంకారములు సేయగ
గర్భస్థదశలో మౌనగీతాలు పాడాను
ప్రకృతి పొత్తిళ్లలో ఊహలపాలు త్రాగాను
పంచభూతాలు వేలుపట్టి నడిపించాయి
అష్టదిక్కులు పరుగులు నేర్పించాయి
ఋతువులన్నీ సన్నిహితులైనాయి
పర్వతాలు శిల్పాలనందించాయి
పక్షులు రెక్కలనంటించాయి..



పూలు పరిమళాలనద్దాయి.....
భావాలు బాహువులు సాచి బారులు తీరుతున్నాయి
ఫలదీకరణకివి మంచి సంకేతాలే !

ముువ్వా శ్రీనివాసరావు కవిత్వం

# సమాంతర ఛాయలు

మండవ సుబ్బారావు




"కవిత్వమొక తీరని దాహం" అన్నాడో మహాకవి. ఈ తీరని దాహం ఎవరికి? కవిత్వం రాసే కవికి దాన్ని చదువే చదువరికీ కూడ. గత నలబది సంవత్సరాలుగా కవిత్వం చదువుతూనే ఉన్నాను. అప్పుడెప్పుడో శ్రీశ్రీ, ఆరుద్ర, తిలక్ ల కవిత్వం చదివినప్పుడు దాహం తీరినట్టే వుంది. చాలా కాలంగా కవిత్వ దాహం తీరడం లేదు. ఓ కవిశ్రీ చెప్పినట్టు ఒక మంచి పుస్తకం లేదా మంచి కవిత్వం చదివితే బాగా భోంచేసినట్టుండాలి. ఆ తృప్తి ఇటీవల వరకు కలుగలేదు.

ఇటీవల కవిత్వానికి కొత్త కొత్త నిర్వచనాలు పుట్టుకొచ్చాయి. "కదిలేది, కదిలించేది" నవ కవితకు లక్షణంగా శ్రీశ్రీ చెప్పి చాలా కాలమయింది. ఆ మాట శతాబ్దానిది. ఇప్పుడీ నిర్వచనంతో కవిత్వం ఎంతమంది రాస్తున్నారో తెలీదు. ఏదేమయినా "చదివేది, చదవించేది" ఇవ్వాళ కవిత్వానికి కావలసిన సవ్వా లక్షా లక్షణాలలో వొకటి. దిన,వార, మాస పత్రికల్లోనే కాక పుస్తకాల రూపంలో బండెడు కవిత్వం వస్తూనే వుంది. కాకపోతే కవిత్వం చదువుతున్నది ఎందరు? అనేది పెద్ద ప్రశ్న. తూర్పార పట్టినాక తాలు, చెత్తా పోను మిగులుతున్న దెంతా అన్నది మరో ప్రశ్న.

చాలా కాలం తరువాత మళ్ళీ మళ్ళీ చదువుకునే కవిత్వాన్ని అందించిన మిత్రుడు క్రాంతి శ్రీనివాసరావు కవిగా ఆవిష్కరించ బడక ముందే ఖమ్మం జల్లాలో మంచి విద్యావేత్తగా పేరున్నవాడు. కాలేజీ పేరునే ఇంటి పేరుగా మార్చుకున్న ముువ్వా శ్రీనివాసరావు సమాంతర ఛాయలు కవితా సంపుటితో కవిగా తెలుగు సాహితీ లోకానికి పరిచయమయ్యాడు. మంచి కవిత్వం కోసం మొహం వాసి పోయిన నాలాంటి చదువరులకు కొంత కాలం వరకు దాహం తీర్చిన భగీరథుడు శ్రీనివాసరావు. 2013లో కొత్తగా పుట్టుకొచ్చిన కవేం కాదు శ్రీనివాసరావు. 1975లోనే శ్రీనివాసరావు అంతర్గత కవిగా కవిత్వాన్ని వండి వార్చి, తనలోనే నిక్షిప్తం చేసుకున్నాడు. మధ్యతరగతి వాడు కావడం వలన, బతుకు బండి లాగటంలో కాలం కాస్తా కరిగిపోయింది. అదే సమయంలో తాను నమ్మిన సిద్ధాంతాల కోసం ఉద్యమాలే ఊపిరిగా క్షణం తీరిక లేక కలం కాగితం మీదకు పోలేదు. కానీ, భావాల వ్యవసాయం సాగుతునే వుంది - అని చెప్పడానికి ఈ సమాంతర ఛాయలు లోని అనేక కవితలే సాక్ష్యం. ఇప్పుడు జీవితం స్థిర పడ్డాక బాధ్యతలన్నీ చక్కబడ్డాక, సప్త సముద్రాలు దాటి వెళ్ళాక, తీరిక అంటే ఏమిటో తెలిసింది. అప్పుడు దొరికిన అంతర్జాలం కొత్త భావాల్ని కొత్త ఆలోచనల్ని కలిగించింది. దానికి కవి మిత్రుడు యాకూబ్ ప్రారంభించిన కవిసంగమం తోడైంది. ఫలితం సమాంతర ఛాయలు. శ్రీనివాసరావు గత స్మృతులు ఒక కాలానికి, ఒక ప్రాంతానికి మాత్రమే చెందినవి కావు. ప్రపంచీకరణ ప్రభావంతో అనేక ఆచారాలు, అలవాట్లు అంతరించిపోతున్నాయి. వాటిలో తన కవిత్వంలో బలంగా చెప్పడం ద్వారా చరిత్రలో సుస్థిర స్థానం కల్పించాడు.

కవిగా శ్రీనివాసరావు ఎక్కడా సంప్రదాయాన్ని పాటించలేదు. "poem of muvva srinivasa rao" అన్న అట్ట చివరి వాక్యం తప్ప. ముందు మాటలూ వెనుక మాటలయ్యాయి. విరామ చిహ్నాలకు విరామమిచ్చాడు. అలంకారాలకు కొత్త కొత్త తరూపాలిచ్చాడు. మహా కావ్యాలలో కామాలు పులుస్టాపులుగా నిలిచి ఏదో అర్థాన్ని ఎరిగిస్తూ వుంటాయి అని కాబోలు వాటి జోలికే వెళ్ళలేదు.

"అధిష్టానమంతా అందగా వున్నప్పుడు
కలువలకు కన్ను గీటుతూ
చుక్కల పక్కలో పడుకొని
చక్కదనాలు పోతున్నావు" అంటూ

చందమామ మీద తనదైన శైలిలో వర్ణన చేశాడు. కొత్త నిర్వచనాలు, కొత్త భాష, కొత్త శిల్పం, కొత్త ఊహలు ఈ సంపుటి

నిండా కనిపిస్తాయి.

మహా నగరానికిచ్చిన నిర్వచనాలు కొత్తగా చెప్పడం కనిపిస్తుంది. "మహా నగరమంటే బజార్లని ముట్టుకోకుండా లోతయిన లోయలుగా తవ్వుకోవడమేనట. జన సముద్రంలో మంచితనం కోసం వెతుకు లాడటమేనట" అక్షర కుసుమాలను మాటల మాలలుగా అల్లుకొంటూ అప్పుడప్పుడు కవితా పంక్తులుగా పేర్చుకొంటూ దాహం తీర్చుకుంటున్నాడు కవి. నిత్యం కవిత్వ గంటలు వినిపిస్తున్నా భావం భాస్వరమైనప్పుడు అక్షర ఫిరంగుల్ని లక్షణంగానే మోగించాడు ముప్వా, శ్రీనివాసరావు. ఆచరణలేని సిద్ధాంతంతో రాద్ధాంతాలను చేస్తున్న "అదిశ" గాళ్ళ మీద "విషయం కక్కే తేళ్ళు శివలింగాల నెక్కి చెప్పు దెబ్బలు తప్పించుకొంటున్నాయి", అని సెటైర్ వేశాడు. గడీలకు గడియ లేస్తే గంగలో కలిసి పోతాయనుకున్నా కానీ, ఆ గడీ గాడు మారు వేషా లేసుకొని మన మధ్యే తిరుగుతూ మాటలకు మంత్రాలు పూసి ఉద్యమాన్ని ఉయ్యాలగా మార్చి వూగుతూనే వున్నాడు. రావణాసురిని తలల్లా ఎన్ని రాల్చినా మళ్ళీ మళ్ళీ పుట్టుకొస్తున్నాయి." మనమే మనల్ని బాణమై నాటుకోవాలి", అంటూ దొరసానుడు మీద, ఫోర్త్ఎస్టేట్‌గా నిలబడాల్సిన వాడు "అజాగళ స్తనమై అఘోరిస్తున్నాడం"టూ దారి తప్పిన కన్ను మీద పెన్ను లేని గన్ను ఎక్కుపెట్టాడు.

ప్రపంచీకరణ తరువాత జీవితం యాంత్రికమైంది. పరాయికరణకు గురైంది. సరుకు కున్న విలువ మనిషికి లేదు. మానవీయత ధ్వంసమైంది. గ్రామాలలో కుల వృత్తులు కూలిపోయాయి. పట్టణాలకు, నగరాలకు చేరుకొని దిన కూలీలై బానిసలుగా బతుకీడుస్తున్న చాకలి, మంగలి కుమ్మరిపై నేలదీపం అంటూ దృశ్యమాలికను కళ్ళకు కట్టి ఓ ముచ్చట చెప్పినట్టు చెప్పాడు శ్రీనివాసరావు. విద్య వ్యాపారమయిందని అందరం అనుకుంటున్న మాటే. కాలుతున్న పసితనం లో అదే చెబుతున్నాడనుకున్నా. కానీ ముప్పుది పంక్తుల్లో మూడు విషయాల్ని ముచ్చటగా చెప్పాడు ముప్వా. "నాకొద్దీ పైసల బడి / అక్కడన్నీ అబద్ధాలే" ఈ ఒక్క మాట చాలు మొత్తం వ్యవస్థను అర్థం చేసుకోడానికి. కవికీ కథా రచయితకు ఇదే తేడా. కవి ఒక్క ముక్కలో చెప్పే విషయాన్ని కథకుడు కథలు కథలుగా చెబుతాడు." వాళ్ళు బ్యాగుల నిండా గొప్పతనాలు మోసుకు తిరుగుతున్నారం"టూ పసివాడు చెప్పే మాటల్లో, వర్గ వ్యవస్థను చదువరి తలపుల్లోకి తీసుకువచ్చాడు కవి. శీర్షికలో మాటను సార్థకం జేయడానికి చివర్లో," ఆకలయినప్పుడల్లా అరచేతిలో అమ్మ ఇచ్చే ముద్దులు చాలయ్యా !" అంటూ అమ్మ ముద్దుల కమ్మదనం పైసల బడిలో చదువుకన్నా మిన్న అని సూత్రీకరించాడు ముప్వా.

మొత్తం వ్యవస్థ కరప్టెడ్ ఐనప్పుడు ఉద్యమాలు, విప్లవాల జోలికి పోకుండా లబో దిబో మంటూ గగ్గోలు పెట్టకుండా శ్రీనివాసరావు సింపుల్‌గా ఒక్కమాటలో తేల్చి పారేశాడు. "సిస్టం ఫార్మాట్ చేయాలి" అంటూ. ఆధునికత సాంకేతికం సంస్కరణల పేరుతో జరుగుతున్న మోసం, విలువలు కోల్పోతున్న మనుషుల ధోరణులు సహించలేనితత్వం శ్రీనివాసరావుది. అందువలనే శ్రీనివాసరావు తన లోపలి కల్లోల్లాన్ని వ్యక్తం జేయడానికి కవిత్వాన్ని వాహికగా చేసుకున్నాడు. ఐతే కవిలో ఎక్కడా నిరాశ కనిపించదు." రాక్షస బల్లులు పోయినట్లే రాకాసి మనుషులూ పోతారు", అంటూ ఆశవాదిగా క్రాంతి మార్గం వైపు చూస్తూ, వ్యవస్థ ఆ వైపే అడుగులు వేస్తూనే వుంటుందని ధైర్యాన్ని చెబుతాడు.

చెట్టు చాలా మంది కవులకు ఆదర్శం, ఆలోచన, ఆవేశం, ముప్వాకు మాత్రం చాలా చాలా ఇష్టం." పూలన్నీ తన కాళ్ళపై తనే చల్లుకొని తనని తానే అభినందించుకొని ఆనందించే చెట్లం"టే ఎవరికి మాత్రం ఇష్టం వుండదు. అందరి ఇష్టాన్ని తన ఇష్టం గాను తన ఇష్టాన్ని అందరికి ఇష్టమైయ్యే విధంగా చేయడమే కవి పని.

జీవితంలో వైవిధ్యాలని, వైరుధ్యాలని, లోతుల్ని జాగ్రత్తగా పరిశీలించి ఒడిసి పట్టుకొని అద్భుతమైన కవిత్వంగా మార్చిన ముప్వా చెప్పదలచుకున్న విషయాన్ని సూటిగా, స్పష్టంగా చెప్పాడు. మధ్య తరగతి ఎప్పుడూ ఒక సంఘర్షణ ఒక సంక్షోభం విసుర్రాళ్ళ మధ్య పెసర బద్దలా నలిగిపోతూనే ఉంటుంది. మార్క్సిజం దృష్టితో సమాజాన్ని చదివిన వాడు, ఉద్యమాల్లో స్వయంగా పాల్గొన్న వాడు, పాల్గొంటున్న వాడు తాను చెప్పదలచుకున్న విషయాన్ని బలంగా చెప్పడంలో చిత్రమేమీ లేదు. కానీ, ఆ చెప్ప దలచుకున్నది చదువరిని ఏకబిగినా చదివించేటట్లు చెప్పడంలో ముప్వా కృతకృత్యుడయ్యాడు.

ఇక కవిగా శ్రీనివాసరావుది విశిష్టమైన శైలి. అనేక కవితల్లో కొత్త మాటలు కనిపిస్తాయి. గదిలో చీకటి వెలిగించి, ధైర్యాన్ని వంపి పోయిన చప్పుడు, ఆమె మౌనం ఆరేసిందిప్పుడే, జనానికి గ్లాసెడు ఆవేశం పోస్తూనే వుంది. నిశ్శబ్దాలు మాటాడుతూ వుంటే, అదృశ్యాలు కన్పిస్తుంటే, నీళ్ళు కూడా నిప్పును రాజేస్తుంటాయి, చెరుకు గడలా మంటల దవడలతో నమిలేస్తున్నాడు సూర్యుడు. మృత్యువుకు మరణశిక్ష విధించాలని వుంది". అబ్బో ఎంత ఆశ." రక్త పుష్పాలు, కలం కాలాన్ని మింగేస్తోంది.

చివరి మాటల్లో ఖాదర్ మొహియుద్దీన్ చెప్పినట్టు తొలి పుస్తకం ద్వారానే శ్రీనివాసరావు చక్కని కవిత్వాన్ని రాసి బెస్ట్ ఎంట్రీ ఇచ్చాడు. ముమ్ముందు వీరి కలం నుండి కాదు కాదు వీరి అంతర్జాలం నుండి మంచి కవిత్వం ఇంకా-ఇంకా షేర్ చేయబడునని ఆశిస్తూ.



# మనిషినా..? మనీ...నా?

రావెల పురుషోత్తమరావు
9394100531



మూడు పదులయినా నిండకముందే
ముసలితనం వాటేసుకుంటున్నది
వార్ధక్యాన్ని వరుమానంగా అందిస్తున్నది
వయసు నొసలుపై ముసలిరేఖలు
ముద్రించ బడకముందే
అనారోగ్యం అతిధిగా తిష్టవేసి కూర్చుంటున్నది
అటూ ఇటూ కదలనివ్వకుండా
ఆర్థికంగా చిక్కి శల్యమయిపోయేలా
దురదృష్టం దాపురిస్తున్నది
మనిషి ముందు పుట్టాడా?
స్వార్థం ముందు అవతరించిందా ?
ససేమీరా అవగతమవడంలేదు
ఆధునిక వైద్య పరిజ్ఞానం ఆలోచనా ధోరణి నశింపజేస్తున్నది
నాడి పట్టుకుని రోగనిర్ధారణ జేయగల నారాయణులేమైపోయారు ?
రోగమొకటి వైద్య మొకటి కార్పోరేట్ ధర్మమా అని గర్భశయాన్ని కోల్పోతున్న
నారీమణుల దురదృష్టానికి ఎవరిని నిందించాలి?
మనిషినా..? మనిషి సృష్టించిన మనీ...నా?
మనీతో పెనవేసుకునిపోతూ మానవత్వపు విలువలను మరచిపోతున్న సమాజాన్నా-?

# 'బాల్యం లేని బ్రతుకు'

తమ్మెర రాధిక
9440626702

బడి పిల్లవాడి హృదయం
గాయపడి నెత్తురు స్రవిస్తోంటే
వాడు ప్రతిజ్ఞ తీసుకున్నాడు.
వాడి గుండెల్లోని
సీతాకోక చిలుకలూ, రంగుల పతంగులూ
ఎగిరిపోయాకా,
ఈతలు కొట్టేచెరువులు
ఎండిపోయాకా,
కాకెంగిలి జాంకాయలు తినే
పక్షులు కూలిపోయాకా
ఎడారి మిగిలిన ఒంటరితనంతో
జీవితం చివరిదాకా
బాల్యం గుర్తుల్ని ఇవ్వలేకపోతున్న
ఈ .....
కాందిశీకుల శిబిరంలో
జీవితాన్ని ఎక్కడో ఒక చోట
వెదుక్కోవాలని !
బానిస చట్టాలు
సంకెళ్ళు వెయ్యగలవే గానీ
తుంచలేవు !!
బంగారు బాల్యాన్ని పొందడానికి
ప్రేమ బంధమే
ఆలంబన !!
యూనిఫాములూ, బూట్లూ
బ్యాగులూ కొంతకాలమే
వెంటరాగలవు.
అవి మోసిన బానిసత్వం
మాత్రం
జీవితాంతం మానని గాయాలే !



## కాలం మారిపోయింది

- పెద్దింటి శేషబాబు
pvseshubabu@gmail.com

కాలం మారి పోయింది ...
నెలకు మూడు వానలు
ఇప్పుడు ఏయేడూ కురవవు
తుఫానులు వస్తాయి ...
వానలు కావు గాలి వానలు
కురుస్తాయి రైతు గుండెల్లో...
ఎంతో కొట్టుకుపోయి
కొంతే చెమ్మ మిగుల్తుంది.

అవసరపడినప్పుడు..
పొలం మడి 'తడి' కావడం ఎప్పుడో...?
జనం కంట మాత్రం
నీటి తడి నిలిచేవుంటోంది.

కాలం మారి పోయింది ...
కాని చట్టాలు మారలేదు,
వాటి 'లూపు హోల్సు' ఇంకా
పెద్ద హోల్సు అయి, పెద్ద వాళ్లకు
'రూల్స్' లేకుండా చేస్తున్నాయి.
ఆ ప్రయోజనాలు అనుభవిస్తున్నంత కాలం
చట్టాలను చచ్చినా మార్చరు
ఎన్నుకున్న వారిని ఏమారుస్తారు.



కాలం మారిపోయింది ...
భూములు భోంచేసే వాడ్ని,
'స్వాములు' నంజుకొనే వాడ్ని,
పదుల మర్డర్లు చేసిన వాడ్ని ...
లక్షల కోట్లు బొక్కిన వాడ్నీ
బొక్కలో వేసినా... కేసులెన్ని పెట్టినా..
పది రోజుల్లోనే 'గెద్దలా' ఎగిరొస్తాడు,
గద్దెల్నీ, న్యాయాన్నీ కోట్లు పెట్టి గణిస్తాడు.
చట్టాలన్నీ నేరస్తుల చుట్టాలని చెప్తాడు.
కాలం మారిపోయింది...
పెత్తందార్లు 'బెత్తం ధారులై'
కూలీలను కాలికింద కుమ్మేస్తున్నారు.
హక్కులని మాట్లాడితే
చుక్కలు చూపిస్తున్నారు.
అధికారాన్ని అడ్డుంచుకొని
కత్తులు దూస్తున్నారు.
తన పొలం దున్నుకున్నా...
తల తీయాలని చూస్తున్నారు.
ధన పిశాచ రాజకీయం...
ధరాభార రాక్షసీయం.

అవును కాలం మారిపోయింది....
పోగాలం దాపురించింది.

## మట్టి మనిషి



శైలజా మిత్ర
9290900879

ఏళ్ళ తరం మోస్తున్న బండను
మట్టి మనిషి ఇంతవరకు దించనే లేదు
ఇదేదో శిక్ష అనుకుంటున్నారు
సర్కస్ అనుకునేవారు ఉన్నారు
కాళ్ళు చక్రాలై, చేతులు బిక్షా పాత్రలై
ఏ గమ్యానికి చేరుతారో కాని
అదో వలయం అంతే!

పంట చేతికి రాకున్నా
జవాబు చెప్పాల్సింది ఆ మట్టి మనిషే
మండే కుంపటి అతని గుండె !
ఆరిన గళం అతని చెమట ధార!

సముద్రాన్ని మథిస్తే
వచ్చే అమృతమయినా
వెంట వెంటనే తీయకుంటే కలిసిపోతుంది
ఉప్పు కషాయం మట్టి మనిషికి మిగులుతుంది

పూతోటలో వెన్నెల కాస్తే
ఆ మట్టి మనిషి అవసరం లేదు
పూల కుండీకి మట్టి అవసరం
కాపలాకు మట్టి మనిషికి అవసరం !
బతుకు బండకు మిగిలేది శ్రమే కాని ఆశ్రమం కాదు...
ఇదో జ్ఞాపకమని పిచ్చి గీతలు వేసుకుని
అద్దాల్లో దాచుకునే వారు ఉన్నారు.
శిల్పంగా మలచి మార్గదర్శకంగా ఎంచుకున్న వారు ఉన్నారు

జారే ప్రతి చెమట బిందువు శ్రమకు చిహ్నం కాదు
ప్రతి పాద ముద్ర భవితకు మార్గదర్శకం కాదు
ప్రతి అరచేయి జీవితం కాదు.
ప్రతి నొసలు కణం మూల్యాంకనం కాలేదు

జీవన్నాటకంలో మట్టితో అవసరం లేదు
నాటకంలో సమాజం ఉంది కాని మట్టి లేదు
మట్టిలో మనిషి ఉన్నాడు కాని నేడు మనసు లేదు
మట్టి నుండి మట్టికి చేరుకునే ఈ ప్రాణానికి విలువ లేదు
అంతరంగానికి మట్టి విలువ తెలిస్తేనే
మట్టి మనిషి కొంతకాలమయినా జీవిస్తాడు

---

## ది హంటర్

-మొయిద శ్రీనివాసరావు
9908256267

చీకటి వలను విసిరి
రేపటి సూర్యోదయాన్ని సైతం
వేటాడేస్తున్నాడని విచారించకండి
వడ్లగింజలకై వాలాల్సిన
కిచ కిచ ధ్వనులు ధ్వంసమవుతున్నాయని
దిగులుతో వరికంకిలల్లే
తలలు దించుకోకండి
బెకబెకల సవ్వడి లేక
కప్పగెంతులు బోసిపోతున్నాయని
గుబులుతో మీ గుండెలను
ఎండిన చెరువులను చేసుకోకండి
సాయంత్రం ఆకాశపు మెడలో



ముత్యాల దండలై బారులు తీరలేదని
కొంగలపై బెంగతో 'చింత'ల మానులవ్వకండి
చిల్లర కాసులు చల్లి పచ్చనోట్లు పండించడానికై
ప్రతీది పొట్టన పెట్టుకుంటుంటే
కనిపించేవి కూలే గుడిసెలపై వాలే ఆకలి పక్షులే
రేపటి లాభాల వేటకై నాలుగు నూకలు చల్లి
నెత్తిన వలవేసి రెక్కలు కత్తిరించాలని చూసినప్పుడు
వలను కాదు ఎగరేసుకు పోవాల్సింది !
విసిరే చేతులను
మొత్తంగా ఖండించాల్సిందే !!

## కులం

ప్రత్యామ్నాయ సంస్కృతి

డా॥ కత్తి పద్మారావు

వెల : రూ.100/- పేజీలు : 182

984974169




వైదిక బ్రాహ్మణ సంస్కృతిని ఎదిరించి పోరాడిన చార్వాక, బౌద్ధ, జైన తత్త్వ శాస్త్రాలను ఈ గ్రంథం వివరించింది. అంతేకాక సాంస్కృతిక విప్లవాన్ని ముందుకు తీసుకెళ్ళిన వీర శైవం, భక్తి కవులు, అంబేద్కర్, పూలే, పెరియార్ ఉద్యమాలన్నింటిని ఈ గ్రంథం సిద్ధాంత భూమికతో వెలువరించింది. ప్రత్యామ్నాయ జీవన విధానాన్ని, ప్రణాళికని ఈ గ్రంథం మన ముందుంచింది.

- లోకాయత ప్రచురణలు

## నేనున్నాగా...

కథలు

రంగనాథ రామచంద్రరావు

వెల : రూ. 60/- పేజీలు : 112

ప్రతులకు : 9290050229




రామచంద్రరావు మానవతా విలువలన్నా, వాటిని పెంచే మన సంస్కృతి, సంస్కారమన్నా ఎంత ప్రేమో ఈ కథానికలన్నీ మనకి చెప్పకనే చెప్తాయి. అందరూ చదవాల్సిన కథానికలు. చదివి మరచిపోవాల్సిన కథానికలు కావు. మనల్ని మనం చెక్ చేసుకోవడానికి తోడ్పడే కథానికలు.

వేదగిరి రాంబాబు

## ఐనా... ఒంటరిగానే..!

కవిత్వం

సప్తం గణేష్‌బాబు

వెల : రూ.60/- పేజీలు : 80

ప్రతులకు : 8977348821




ఇతని కవిత్వంలో ఆర్ద్రత వుంది. చెప్పే తీరులో భావనాశక్తి వుంది. పాఠకుణ్ణి వైరుధ్యంతో కాకుండా నచ్చజెప్పే ధోరణి వుంది. దాదాపు ప్రతి కవితలోనూ మానవత్వం కోసం అభ్యర్థన వుంది.

-డా॥ అద్దేపల్లి

## పట్టుకుచ్చుల పువ్వు

కవిత్వం

దాసరాజు రామారావు

వెల : రూ.50/- పేజీలు : 136

ప్రతులకు : 9618224503




ఇందులోని కవితలను ఒకే ఒక్క వస్తుకేంద్రంగా చెప్పాలనుకున్నప్పుడు ఇవన్నీ మనిషిలోని మనిషితనం పరాయీకరింపబడడం గురించి పడిన ఆవేదనను, మనిషి అస్థిపంజరంలోకి సజీవ సంచలన రక్తమాంసాలను మళ్ళీ ప్రోది చేసి మనిషితనాన్నీ, మంచితనాన్నీ ఆవిష్కరించాలన్న గాఢమైన ఆకాంక్ష.

వరవరరావు

## విశాఖజిల్లా కథానికా ప్రస్థానం - పరిణామ దర్శనం

డా॥ రామావత్ కుసుమ కుమారి

వెల : రూ.525/- పేజీలు : 630

ప్రతులకు : 9866022347



సాహిత్యం ఎప్పటికప్పుడు ప్రజా భావజాలాలను విశ్లేషించి నిర్మాణశీల దిశానిర్దేశం చేస్తుంది. అంతే కాకుండా సాహిత్యం, చరిత్ర చెప్పని ఎన్నో సత్యాలను చెప్తుంది. అందువల్ల సాహిత్యాన్ని కూడా సమాజశాస్త్ర పరిశోధనా విధానంలోనే శాస్త్రీయంగా, పరిశోధించాలనీ జయంతి పాపారావు నాకు చెప్పి నా పరిశోధనకు దిశానిర్దేశం చేశారు.

డా॥ రామావత్ కుసుమ కుమారి

## గుంటూరు జిల్లా బంజారా గేయాలు - పరిశీలన

డా॥ రామావత్ కుసుమ కుమారి

వెల : రూ.150/- పేజీలు : 140

ప్రతులకు : 9866022347




ఒక పరిశోధన చేయాలంటే దానికి ఎంతోమంది సహకారం కావాల్సి ఉంటుంది. లేదంటే పరిశోధనను కొనసాగించలేం. అందులోను ఉద్యోగం చేస్తూ చేయడం అనేది చాలా కష్టం. నా ఈ పరిశోధన "గుంటూరు జిల్లా బంజారా గేయాలు - పరిశీలన" అనే ఈ అంశం మీద మైనర్ రీసెర్చి ప్రాజెక్టును చేపట్టి విజయవంతంగా పూర్తిచేయడం జరిగింది.

డా॥ రామావత్ కుసుమకుమారి

# కొత్త పుస్తకాలు

## బుద్ధభూమి

బౌద్ధ ధమ్మపత్రిక

అన్నపరెడ్డి బుద్ధ ఘోషుడు

వెల : రూ.15/- పేజీలు : 136

ప్రతులకు : 9949145650




మహానవీయ ఆచరణకు అనుగుణ్యమైన ధర్మచింతనను సమాజ ప్రధాన స్రవంతిలోకి ప్రవహింపజేసిన వ్యక్తులనెన్నడూ ప్రజలు మర్చిపోరు. అటువంటి అరుదైన వ్యక్తులలో అగ్రగణ్యుడు అశోకుడు. ఆ మహనీయుడు ప్రజల హృదయాల్లో, దేశ చరిత్రలో చిరస్థాయిగా నిలిచివుంటాడు. ఆ మహనీయునికి బుద్ధభూమి అక్షర నివాళి అర్పిస్తుంది.

**- గోలి సీతారామయ్య**

## ఆనవాళ్ళు

కవితా సంకలనం

లాడె ధనుంజయ

వెల : రూ.100/- పేజీలు : 128

ప్రతులకు : 9618241994




ఈ 'ఆనవాళ్ళు' జ్ఞాపకాల ఆనవాళ్ళు. ఈ జ్ఞాపకాలు బాల్యంలో మనస్సులో ముద్రపడిన పల్లె స్మృతులు. ఇందులో దాదాపు శతార్ధ శతాబ్ది కవులూ, షష్టిలబ్ది పూర్తి కవితలూ ఉన్నాయి. అన్ని కవితలు పల్లె చుట్టూ సంచరించాయి. ఇందరి కవుల వేరు వేరు కవితల సంకలనం కాదు 'ఆనవాళ్ళు' అందరూ పల్లెను మధురంగా స్మరించుకొన్న, గుర్తుంచుకొన్న, గుర్తుకు తెచ్చుకొన్న కవితలే !

- కొలకలూరి ఇనాక్

## అంతర్గానం

నవల

అల్లూరి (పెన్మెత్స) గౌరీలక్ష్మి

వెల : రూ.100/- పేజీలు : 157

ప్రతులకు : 9948392357




నేలవిడిచి సాము చేయకుండా తనకు తెలిసిన సమాజాన్నీ, మనుషుల తత్వాన్నీ వారి జీవన స్థితిగతుల్నీ, అనుభవశాలిగా, లోకాధ్యయనశీలిగా చక్కగా చిత్రించారు గౌరిలక్ష్మి. మనకి బాగా తెలిసిన నవలా వస్తువే మన ఆలోచనల్ని కుదుపుతూ సాగటం ఈ రచనలోని గణ విశేషంగా చెప్పుకోవాలి. మీరూ ఈ నవలా పఠనానందాన్ని పొందండి.

**- విహారి**

## క్షితిజం

కథల సంపుటి

పెద్దాడ వెంకటేశ్వర్లు

వెల : రూ.100/- పేజీలు : 153

ప్రతులకు : 9959478245




ఈ సంపుటిలో 22 కథలున్నాయి. కథాంశాలూ, ఎన్నుకున్న సన్నివేశాలూ విభిన్నం. చాలా కథల్లో – అదే పేరుతోనో, మరో పేరుతోనో తటస్థపడే వెంకటేశం పాత్రలో రచయిత వ్యక్తిత్వం తొంగిచూస్తుంది. కల్పనలో స్వానుభవాల నేపథ్యం స్పష్టమౌతుంది. కథలే కుటుంబం చుట్టూ తిరిగినా– ఆ కుటుంబంలో మననీ పాత్రని చేస్తాయి. సన్నివేశాలు – కథ మనదే అనిపింపజేస్తాయి.

**- వసుంధర**

## ప్రణవం

కవితా సంపుటి

వరిగొండ కాంతారావు

వెల : రూ.100/- పేజీలు : 168

ప్రతులకు : 9441886824




శ్రీ కాంతారావు గారు కథకుడు. ఆ తరువాతనే కవి. వారి రచనలో వ్యంగ్యత. అధిక్షేపము, సున్నిత హాస్యము జీవము పోసుకొని పాఠకుడికి సంభ్రమాశ్చర్యాలు కలిగిస్తూనే, ఒక పక్క కాస్త ఇబ్బంది పెట్టేదిగా నున్నట్టు అనిపించినా మనసుకు హత్తుకుంటుంది. ఇందువలన పాఠకుడు రంజకుడు అవుతాడు. ఇది కాంతారావు గారు **డా॥ టి. శ్రీరంగస్వామి**

## విద్య ఉపాధ్యాయుడు సమాజం

యన్. సుబ్రహ్మణ్యం

వెల : రూ.20/- పేజీలు : 106

ప్రతులకు : 9949364241




2012 నవంబరు 25న కామన్ స్కూల్ విధానాన్ని, మాతృభాషలో విద్యాబోధనను డిమాండ్ చేస్తూ 'పిల్లల సమగ్ర వికాసానికి తోడ్పడే ప్రభుత్వ పాఠశాలల్ని పరిరక్షించుకొందాం' అన్న నినాదంతో – ప్రైవేటీకరణను పెంచుతున్న ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా జిల్లా సదస్సు జరుగుతున్న సందర్భంగా పలువురు విద్యావేత్తలు చేసిన ఉపన్యాసాలను, రాసిన వ్యాసాలను, సంకలనంగా తెచ్చేందుకు పూనుకుంటున్నాం.

- ప్రచురణకర్తలు

# మరణం ఆరంభం

- సిద్దెంకి యాదగిరి
9441244773

మరణం ఏం చేస్తది ?
మరణం మనిషి గమ్యం కాదు
ఒత్తిడి తిరుగుబాటు చేయకుంటే
అనుక్షణం హింసిస్తది
మెదడును నెమరేస్తూ ఎముకల్ని కొరుకుతూ
పచ్చి నెత్తురయి ప్రాణాన్ని జుర్రుకుంటూ
పిరికి వాళ్లను హత్య చేస్తూనే వుంటది

రివ్వున ఎగిరే గువ్వల ప్రేమను
కాదని కబళిస్తున్నపుడు
చూపు నిలిచిన కళ్ళను కనికరించి
ఇద్దరినీ ముద్దుగా అద్దుకుంటది

ఉద్యమ ఉధృతి ఆరిపోతున్నపుడు
మంటలో మాడిపోయిన నల్లటి దేహం
మేలు కొలుపు మంటల్ని రగిలించి
అణచే వెతల్ని అనేక కోణాల్లో చుట్టి ముట్టి

పోరుమంటను రాజేస్తది
ద్వేషం నింపుకొని, రోషం పెంచుకొని
సంకెళ్ళు తెంచటానికి ఉరికొయ్యకు వేలాడుతూ
బానిసముక్తిని దేశభక్తిని
మనసు పోరలపై గురినిలుపుతది



సహజ వనరుల సామ్రాజ్య వాద దోపిడి
కాలుదువ్వి కాలర్ ఎగరేసే క్యశ్చన్ మార్క్‌ను
బహిరంగంగా హత్యజేసి
ప్రసారం చేస్తూ పైశాచికానందం పొందే డాలర్‌ను
'ప్రశ్న' ఎపుడూ కొంగవాలు కత్తియై నీడలా వెంటాడుతది
నిరాయుధ తలలపై సాయుధ దాడి
కలల్ని అంతం చేసే కత్తుల కళ
యుద్ధాయుధమై నెత్తురుతాగే తల్వారుతండ్లాట
రువ్వడిగా దూరి ప్రాణమింగే తూటా
రోగవ్యాధుల వ్యాప్తి నశీవ

అసహజ బతుకువ్రణం
పంత పలిగే చోటుకి పాదాల్ని నడిపించే మృత్యువు
బహురూపులుగా బాహువులు చాచి
ఒక్కరినీ వదలకుండా అందరినీ ఆహ్వానిస్తది

యిపుడు అన్నిమతాల సారమొక్కటే
ఆత్మను చంపే ఆయుధమేలేదు
ఆశల ఆశయాలను కాలరాసిన
కాలమెక్కడా చరిత్రలో కనిపించదు
జీవిత లక్ష్యాలకు అడుపడిన సాక్ష్యమెక్కడా
అగుపించదు
జనహిత సుగుణాలెపుడు ఖననం కావు
అయినపుడు మనల్ని మరణం ఏంచేస్తది ?

---

# గజల్

ద్యావరి నరేందర్ రెడ్డి
9848995597



పగల సెగలు ఎగిసి మనసు కాలుతుంది తమ్ముడా
ప్రేమ జల్లు కురిసినపుడు - ఆరుతుంది తమ్ముడా

అందదంటు నీరసిస్తే - అందదులే ఏదియూ
శక్తి తోడ అందలమే - అందుతుంది తమ్ముడా

దాచుకున్న సిరులలోను - లభించునా సంతృప్తి !
దానగుణము ఘనకీర్తిని - నిలుపుతుంది తమ్ముడా

శూన్యంలో ముదురుకొనగ - ముగిసిపోదు జీవితం
భవితెంతో మనకోసం - వెలుగుతుంది తమ్ముడా

విలపిస్తూ కూలబడితే - కష్టమేమి కరుగదే
శ్రమచిందగ జీవితమే - నవ్వుతుంది తమ్ముడా

సత్యానికి మసిపూయగ - గెలువబోదు అసత్యం
ధరణియందు సత్యమొకటె - మిగులుతుంది తమ్ముడా

వ్రాసినదే చాలంటే - ఒప్పదులే నరేంద్రకు
కాలంతో కవిత్వమే - సాగుతుంది తమ్ముడా

# ఆఫ్రికా అక్షరజ్వాల చినువా అచెబె



గుడిపూడి విజయరావు

**"సంత జరిగే ప్రదేశంలో ఆ ఉదయం పూట అంతా సందడిగా ఉంది. అక్కడ దాదాపు పదివేల మంది పోగయ్యారు. అంతా చాల నెమ్మదిగా మాట్లాడు కుంటున్నారు. ఒగుఫె ఎజుగో లేచి నిలబడ్డాడు. బిగించిన పిడికిలి గాలిలోకి విసురుతూ 'ఉమోఫియా క్వేను' అంటూ నాలుగు సార్లు ఒక్కో సారి ఒక్కో వైపుకు తిరుగుతూ బిగ్గరగా నినదించాడు. ప్రతి సారి ఆ పదివేల మంది జనం 'యా' అంటూ సమాధానమిచ్చారు. మళ్లీ అంతా ప్రశాంతం. ఎజుగో గొప్ప శక్తివంతమైన వక్త. ఐదో సారి 'ఉమోఫియా క్వేను' అంటూ నినదించాడు. జనం అంతా 'యా' అంటూ ప్రతిధ్వనించారు. అప్పుడు ఎంబయానో తెగ ఉండే దిశగా చూపించి, పళ్లు పటపట కొరుకుతూ 'ఆ అడవి జంతువుల కొడుకులు ఉమోఫియా బిడ్డను హత్య చేయడానికి సాహసించారు.' అని ఎజుగో చెప్పి... జనంలో ఆగ్రహం నెలకొనేందుకు కొంత వ్యవధి ఇచ్చాడు. ఆ తర్వాత నిరావేశపూరిత స్వరంతో ఉమోఫియా ఆడపడుచు ఎంబయానో సంతకు వెళ్లడం, అక్కడ హత్యకు గురికావడం గురించి వివరించాడు. ఆ స్త్రీ ఒగ్బ్యూఫె ఉడో భార్య అంటూ తన సమీపంలోనే తలవంచుకొని కూర్చొన్న వ్యక్తి వైపుకు చూపించాడు. జనంలో ఒక్కసారిగా ఆగ్రహం కట్టలు తెంచుకుంది...."**

ఇది నైజీరియా సీనియర్ రచయిత చినువ అచెబె ప్రసిద్ధ నవల "చిన్నాభిన్నం" (థింగ్స్ ఫాల్ అపార్ట్) లోని ఓ శకలం. ఆధునిక ఆఫ్రికన్ సాహిత్య పితా మహుడిగా పేరుగాంచిన చిను అచెబె మార్చి 21న కన్నుమూశారు.

అచెబె రచనలు ప్రపంచంలోని అనేక భాషల్లోకి అనువదించబడ్డాయి. ముఖ్యంగా 1958లో రాసిన 'థింగ్స్ ఫాల్ ఎపార్ట్' నవల 50 భాషల్లోకి అనువదించ బడింది. కోటి కాపీలకు పైగా అమ్ముడు పోయింది. ఆఫ్రికాకు చెందిన ఏ ఇతర రచయిత రచనలు ఇన్ని ప్రపంచ దేశాలకు చేరలేదు. 'థింగ్స్ ఫాల్ అపార్ట్' తర్వాత చాల కాలం వరకు ఆయన మరో ప్రధాన రచన చేయలేదు. 1987లో మాత్రమే ఆయన రాసిన 'యాంట్ హిల్స్ ఆఫ్‌ది సవన్నా' నవల వెలువడింది. అచెబె ఇంగ్లీషులోనే రచనలు చేసే వారు. ఎందువల్లనంటే 200కు పైగా విభిన్నమైన భాషలు మాట్లాడే ఆఫ్రికా ప్రజలందరికీ అవి చేరాలంటే ఇంగ్లీషులో రాయడమే ఉత్తమమైన మార్గమని ఆయన భావించారు. విశేషమేమంటే ఎన్నో ప్రపంచ భాషల్లోకి తన రచనలను అనువదించడానికి అనుమతించిన అచెబె తన మాతృభాష ఈబోలోకి మాత్రం వాటిని అనువదించడానికి ఇటీవలి వరకు అంగీకరించలేదు. మూల భాషను వలసపాలకులు భ్రష్టు పట్టించారని, అలాంటి అపభ్రంశపు భాషలోకి తన రచనలను అనుమతించనని ఆయన చెప్పేవారు. తన మూలాల పట్ల ఆయనకున్న ప్రగాఢ అభిమానానికి అది చిహ్నం.

అచెబె 1930 నవంబరు 16న తూర్పు నైజీరియాలోని ఒగిడిలో జన్మించారు. ఆయన తండ్రి ఒక మిషన్ స్కూలు టీచరు. ఆయన తల్లిదండ్రులు తమ సంప్రదాయ ఇబో సంస్కృతికి చెందిన విలువలను అనేక రకాలుగా అచెబెలో నాటినప్పటికీ వారు గట్టి విశ్వాసమున్న క్రైస్తవులు. అందుచేతనే అచెబెకు అప్పటి విక్టోరియా రాణి భర్త ప్రిన్స్ ఆల్బర్ట్ పేరుతో ఆల్బర్ట్ అని నామకరణం చేశారు. 1944లో అచెబె ఉముహాయియా లోని ప్రభుత్వ కళాశాలలో చేరారు. ఆ తర్వాత వోలే సోయింకా, ఎలెచి అమడి, జాన్ ఒకిబో లాంటి ప్రముఖ నైజీరియా రచయితలందరి మాదిరిగానే ఇబడాన్ యూనివర్సిటీ కాలేజీలో అచెబె ప్రవేశించారు. అక్కడ ఇంగ్లీషు, చరిత్ర, థియాలజీలను అభ్యసించారు. అక్కడే తన ఇంగ్లీషు పేరును తిరస్కరించి చినువాగా మార్చు కున్నారు. 1953లో బిఏ పట్టా పుచ్చుకుని నైజీరియా బ్రాడ్‌కాస్టింగ్ కంపెనీలో ఉద్యోగిగా చేరారు. ఆ కాలంలో ఆయన ఆఫ్రికాలోను, అమెరికాలోను పర్యటించారు. కొద్ది కాలం పాటు టీచరుగా కూడ పని చేశారు. 1960వ దశకంలో నైజీరియా విదేశాంగ శాఖలో డైరెక్టరుగా ఉంటూ 'వాయిస్ ఆఫ్ నైజీరియా' కు బాధ్యత వహించారు.

నైజీరియాలో అంతర్యుద్ధం (1967-70) సాగుతున్నపుడు అచెబె బియాఫ్రన్ ప్రభుత్వ సర్వీసులో ఉన్నారు. ఆ తర్వాత అమెరికా, నైజీరియా విశ్వ విద్యాలయాల్లో బోధించారు. అప్పటినుండి ఆయన రచనల్లో స్వాతంత్ర్యానంతర నైజీరియాలో పరిణామాల పట్ల తీవ్ర అసంతృప్తి వ్యక్తమవుతూ వచ్చింది. 2004లో నైజీరియా ప్రభుత్వం ప్రకటించిన ద్వితీయ అత్యుత్తమ పురస్కారం 'కమాండర్ ఆఫ్ ది ఫెడరల్ రిపబ్లిక్' ను తిరస్కరించడం కూడ ఈ ధిక్కరణలో భాగమే.

అచెబె తానుగా రచనలు చేయడంతో పాటు ఇతర ఆఫ్రికా రచయిత లను కూడ బాగా ప్రోత్సహించారు. క్రిస్టఫర్ ఒకిబె అనే రచయితతో కలిసి 1967లో ఆయన ఎంగుగోలో ఒక ప్రచురణ సంస్థను స్థాపించారు. ఆ తర్వాత ఆయన నైజీరియా విశ్వవిద్యాలయంలో రీసెర్చ్ ఫెలోగా నియమితులయ్యారు. ఆ విశ్వవిద్యాలయంలో ఇంగ్లీషు ప్రొఫెసర్‌గా పనిచేసి 1981లో పదవీ విరమణ చేశారు. 1971లో ఆయన నైజీరియా నూతన రచయితలకోసం ఏర్పాటయిన ఒకికె పత్రికకు సంపాదక బాధ్యతలు నిర్వహించారు. అమెరికా, మసాచుసెట్స్



విశ్వవిద్యాలయంలో కూడ ఆయన ఇంగ్లీషు ప్రొఫెసరుగా పనిచేశారు. 1990వ దశకంలో ఆయన బార్డ్ కాలేజీలో ఫాకల్టీ మెంబరుగా ఉన్నారు. ప్రఖ్యాత ప్రచురణ సంస్థ హీన్‌మెన్ వద్ద అచెబె ఆఫ్రికా రచయితల సీరీస్‌కు సంపాదకత్వం వహించారు. ఆ సంస్థ ప్రచురించిన మొదటి రెండు పుస్తకాలు అచెబె నవలలే. ఇటీవల కాలం వరకు ఆ సీరీస్‌లో మూడోవంతు ఆదాయం అచెబె నవలలపైనే వచ్చేదంటే ఆయన రచనల ప్రాచుర్యాన్ని అర్థం చేసు కోవచ్చు. అదే కాలంలో అచెబె ఇతర ఆఫ్రికా రచయితల నవలలు సైతం ఇతోధికంగా ప్రచురించ డానికి కారణ మయ్యారు. ఒక కారు ప్రమాదంలో అచెబె నడుం క్రింది భాగం అంతా చచ్చుబడి పోవడంతో 1990 నుండి వీల్ చైర్‌కే పరిమితమయ్యారు.

అచెబె తన రచనల నేపథ్యాన్ని తానే చక్కగా వివరించారు: "నేను స్కూలుకు వెళ్లడం మొదలు పెట్టి రాయడం, చదవడం నేర్చుకునే టప్పటికి ఇతర దేశాల, ఇతర ప్రజల గాథలు మాత్రమే తెలుసుకోగలిగే వాడిని. అవన్నీ తెల్ల వారి మంచితనం గురించే ఉండేవి. సహజంగా నేను కూడ తెల్లవారంత మంచివారు లేరని నమ్మేవాడిని. వారే తెలివికలవారు, మిగతా వారంతా వెర్రివారని భావించే వాడిని. అప్పుడే నాకనిపించింది, అసలు మనకంటూ మన కథలుండాలి కదా అని. నాకు ప్రసిద్ధ సామెత గుర్తుకు వచ్చింది. సింహానికి తన చరిత్ర తనకు తెలియకపోతే, వేటగాడి చరిత్రే ఎల్లప్పుడూ కీర్తించ బడుతుందన్నది ఆ సామెత."

అలాంటి జ్ఞానోదయం ఫలితంగా వెలువడిందే అచెబె మొదటి నవల 'థింగ్స్ ఫాల్ అపార్ట్'. దానిలో భావావేశాలకు అతీతంగా చరిత్రను వస్తుగతంగా చిత్రీకరిస్తారు అచెబె. ఈబో తెగకు చెందిన బలసంపన్నుడైన నాయకుడు ఒకాంక్వో చుట్టు కథ అల్లబడుతుంది. ఒకాంక్వో జీవితం చాల సాఫీగా, ఆనందంగా సాగిపోతుంటుంది. ముగ్గురు భార్యలు, పదకొండుమంది సంతానం. పుష్కలంగా పంటలు పండు తుంటాయి. గాదెల నిండా ఆహారం నిల్వలు. ఇలాంటి సమయంలో అనుకోకుండా ఓ ఉత్సవంలో ఒకాంక్వో తన తెగకు చెందిన ఒక పిల్లవాడిని చంపుతాడు. దానితో ఏడేళ్లపాటు తెగను వదిలి పెట్టి కుటుంబంతో సహా ప్రవాసం పోవాల్సి వస్తుంది. ఈ ఏడేళ్లు ముగియగానే తిరిగి వచ్చి ఎప్పటి మాదిరిగా సంతోషంగా జీవితం గడపాలని అనుకుంటాడు ఒకాంక్వో. కాని ఈ ఏడేళ్ల కాలంలో తన తెగ వారు నివసించే ప్రాంతంలో ఎన్నో మార్పులు సంభవిస్తాయి. తాను ఎంతో మిన్నగా ప్రేమించే సంప్రదాయాల స్థానంలో, క్రిస్టియన్ మిషన్ల ప్రవేశం ఫలితంగా వూహించని పరిణామాలు సంభవిస్తాయి. విదేశీయులు తమ మతాన్ని స్థాపించి, అక్కడి సంప్రదాయాల్ని దెబ్బతీయడమే కాకుండా, స్వంత ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి వారందరిపై పెత్తనాన్ని చెలాయిస్తుంటారు. ఇలాంటి పరిస్థితిలో ఒకాంక్వో తిరిగి తన స్వంత స్థలానికి వస్తాడు. కాని తాను ఆశించిన సంతోషం కాని, ఆనందం కాని అతనికి లభించవు. పైగా పరాయి ప్రభుత్వ ప్రతినిధుల చేతిలో నిర్బంధానికి, చిత్రహింసలకు సైతం గురవుతాడు. పరాయి దేశస్తులను, వారి మతాన్ని తీవ్రంగా ద్వేషిస్తాడు. కాని తనలాగే తన తెగకు చెందిన ఇతరులంతా అలా ఎందుకు ద్వేషించడం లేదో అతనికి అర్థం కాదు. చాల మంది వారి మతాన్ని అనుసరించి, వారి పాలనకు లోబడటం అతను ఎంత మాత్రం జీర్ణించుకోలేకపోతాడు. ఈ పెను మార్పులను, అవమానాల్ని తట్టుకోలేని ఒకాంక్వో చెట్టుకు వురేసుకొని చనిపోతాడు.

ఇది స్థూలంగా కథ కాగా, దాన్ని అచెబె చెప్పిన తీరు అత్యద్భుతంగా ఉంటుంది. గిరిజన తెగల సంప్రదాయాలు, విశ్వాసాలు, వారి ఉత్సవాలు, ఆడవారి మనోభావాలు, వారి కష్ట సుఖాలు, పిల్లల కోసం తల్లిదండ్రులు పడే ఆరాటాలు, ప్రకృతితో ఆ గిరిజనుల జీవన పోరాటం- ఇలా అన్నీ కళ్లకు కట్టినట్లు చూపించారు అచెబె. చెప్పడం కన్నా చదివి ఆస్వాదిస్తేనే ఆ మాధుర్యం పూర్తిగా అర్థమవుతుంది. అచెబె ఇంగ్లీషులో రాసినప్పటికీ సందర్భానికి అనుగుణంగా ఆ తెగ మాట్లాడే పదాలనే ఆయన వాడతారు. దానితో ఆ రచనలో నేటివ్ టచ్ ఎక్కువగా కనిపిస్తుంది. పాత్రల పరిచయంతో పాటు, వాడిన ఆఫ్రికా పదాల వివరణలు కూడ ఆ నవల ఆరంభంలో ఉంటాయి. ఇలాంటి ప్రామాణిక రచన తెలుగులో కూడ వెలువడినప్పటికీ, ఒరిజినాలిటీ మాత్రం దానిలో ప్రతిఫలించలేదు.

'థింగ్స్ ఫాల్ అపార్ట్' తర్వాత చాల కాలం వరకు పెద్ద రచనలు చేయనప్పటికీ అచెబె అనేక కథలు రాశారు. వ్యాసాలు సంకలనాలు ప్రచురించారు. కవిత్వం కూడ రాశారు. చిన్న పిల్లల కోసం కూడ అనేక పుస్తకాలు రచించారు. 'నో లాంగర్ ఎట్ ఈజ్', 'యారో ఆఫ్ గాడ్' అనేనవలలను 1964లో రాసినప్పటికీ, వాటి ఇతివృత్తాలు కూడ క్రిస్టియన్ మిషన్ రాక, వలస పాలన ఫలితాలే. 1987లో వెలువడిన 'యాంట్ హిల్స్ ఆఫ్ ది సావన్నా' నవల ఒక వూహాజనిత పశ్చిమాఫ్రికా దేశంలో సమకాలీన పరిస్థితులను వ్యంగ్యంగా వివరిస్తుంది. దానిలో ప్రధాన పాత్ర శామ్ అనే సైనికాధికారిది. అతను ఆ దేశానికి అధ్యక్షుడుగా కూడ అవుతాడు. ఆ తర్వాత విపరీతమైన అధికార దుర్వినియోగానికి పాల్పడతాడు. దాన్ని ప్రతిఘటించిన తన స్నేహితులను సైతం అంతం చేస్తాడు. చివరికి ఒక సైనిక కుట్రతో పదవీచ్యుతుడవుతాడు. ఆఫ్రికా దేశాల్లో పరిణామాలను అనుసరించే వారికి ఇవన్నీ తెలిసిన విషయాలే అయినప్పటికీ అచెబె తనదైన శైలిలో వాటిని వివరించడం, వాటి ద్వారా ఆయన అందించే సందేశం ముఖ్యమైనవి. ఏ రచనకైనా ఒక ప్రయోజనం ఉండాలని, మంచి సందేశం దానిలో ఇమిడి ఉండాలని అచెబె దృఢంగా విశ్వసిస్తారు.

అచెబె 2007లో బుకర్ ప్రైజ్ అందుకున్నారు. ఆ బహుమతి తనను తాను గౌరవించుకోవడమేనని ప్రముఖులు పేర్కొన్నారు. ఆధునిక ఆఫ్రికా సాహిత్యానికి పితామహునిగా పరిగణించబడే 76 ఏళ్ల అచెబెకు నోబెల్ బహుమతి రాకపోవడానికి కారణం తెల్లజాతివారి పట్ల, వలస పాలకుల పట్ల ఆయన రచనల్లో వ్యక్తమయ్యే నిరసనే అన్నది చాల మంది విశ్వాసం. వలసదేశాల ప్రజల పట్ల సానుభూతి చూపుతుందని శ్వేతజాతీయులు పరిగణించే జోసఫ్ కాన్‌రాడ్ రచన 'హార్ట్ ఆఫ్ డార్క్‌నెస్'ను అచెబె తీవ్రంగా విమర్శించడం కూడ సంపన్న దేశాల వారి ఆగ్రహానికి కారణం కావచ్చు. కాన్‌రాడ్ పూర్తి స్థాయి జాతి దురభిమాని అని అచెబె విమర్శించారు. అంతేకాదు, విఎస్ నాయిపాల్‌ను ఆధునిక కాన్‌రాడ్ అనికూడ ఎత్తిపొడిచాడు.

ఆఫ్రికన్ ప్రజల జీవనచిత్రాన్ని, అత్యంత సహజంగా, శక్తివంతంగా తన రచనల ద్వారా ప్రపంచానికి చాటిన మహా రచయిత చిను అచెబె.

# అమరత్వం

సి. హెచ్. మధు
9059660326

ఆనవాళ్లు లేని ఆకాశంపైన
ఆనందంతో గంతులు వేయటం
విజయానికి చిహ్నమే కానీ -
అపుడపుడు చుక్కలు నేల రాలుతుంటాయి
చుక్కలు నేల రాలటం దుఃఖమే కానీ
తప్పని పరిణామంలో చెప్పరాని దుఃఖం ఇది
దుఃఖమంటే తలదించటం కాదు
దుఃఖమంటే ఓడిపోవటం కాదు
కన్నీరు కూడా ఒక ఆయుధమే -
ఏ నక్షత్రమైనా వూరికే నేలరాలటం లేదు
యుద్ధంలో భాగం ఒక ఆత్మత్యాగం
పోరాడి పోరాడి
నేలరాలుతున్న నక్షత్రం
రేపటి వెలుగుకు సంకేతం
నేటి మెరుపుకు స్ఫూర్తి దాయకం



ఆకాశం అపుడపుడు గర్వపడుతుంటుంది
వీరులు నాకు పేరు తెస్తున్నారని -
పోరాట జెండాలు ఎగిరేస్తున్నారని -
నక్షత్రాలను చూచి -
నేనూ ఓ నక్షత్రం కావాలని నాకుంది
మెరిసేదే నక్షత్రం
మెరుపు లేనిది నక్షత్రం కాదు
మెరవని నక్షత్రం నేల కూలదు

---

# మట్టి మహిమ

బండారి రాజ్‌కుమార్
9959914956

మట్టి మెత్కులు బుక్కినం
రాగడి జావ జుర్రినం
గంజి గతుకుతూనే...
కన్నీళ్ల మడులు దిగమింగినం
మానుకోట రాళ్లు రువ్వినం
ఈ మట్టి మహిమ గల్లది
జడుసుకున్నపుడు
మా నుదిట ఇబూతి మంత్రమైంది
కరువొచ్చినప్పుడు
మాసెత్తకు ఎరువుగ పనికొచ్చింది
దొరా !... అన్న నోరే
ఎందిరా... అని ఎదురు తిరిగింది
బాంచెన్ అన్న బతుకు
బద్మాష్ అని గర్జించింది
గుద్దులిమి చూసింది
రజాకార్ల లాగులు తడిసినై



నిజంగానే...
ఈ మట్టి మహిమగల్లది
కాళ్లు పిసికిన సేతులకు...
కొడవళ్లు నూరటం నేర్పింది
ఎత్తిన పిడికిళ్లకు....
పిడిగుద్దులు ఇసరడం నేర్పింది
సమ్మక్క - సారలక్క
చాకలి ఐలమ్మ
షేక్ బందగీ
దొడ్డి కొమురయ్య
రావి నారాయణరెడ్డి  ఇంకా ఎందరెందరో...
ఇక్కడి మట్టివాసన పీల్చిన యోధులే !
పోరాట పాఠాలు నేర్పిన వీరులే !!

## కళారూపశిల్పి అడబాల



1936 ఫిబ్రవరి 9వ తేదీన వెస్ట్ గోదావరి జిల్లాలో జన్మించిన అడబాల, తల్లి సత్యమ్మ, తండ్రి వెంకన్న నాయుడు. అటు నటన, ఇటు మేకప్ రంగాల్లో డాక్టర్ గరికపాటి రాజారావు గారి వద్ద నటనలోను, ఆదర్శ నాట్య మండలి, పాలకొలు చీఫ్ మేకప్ ఆర్టిస్టు అయిన మెషక్ వద్ద మేకప్‌లోనూ శిక్షణ పొందారు.

20 సంవత్సరాలపాటు మేకప్ ఆర్టిస్టుగా పనిచేశారు. పాలకొల్లులో ప్రజానాట్య మండలి ప్రదర్శనల్లో 1966 వరకూ ఎన్నో నాటకాలు ప్రదర్శించి నటించడమే కాక, దర్శకత్వం కూడా చేశారు. సుమారు 20 నాటకాల్లో, 60 నాటికల్లో అనేక పాత్రలు పోషించి నటుడుగా తనకంటూ ఒక స్థానం సంపాదించుకున్నారు అడబాల. మేకప్‌లో 100 నాటకాలకు 5000 డాన్స్ బాలేలకు ముఖ్యంగా ప్రముఖ నాట్య కళాకారిణులైన డాక్టర్ శోభానాయుడు, ఉషాగాయత్రిలకు కూడా వీరు తమ కళతో రంగులద్దారు, జలజ అనే కలం పేరుతో అనేక కథలు రాశారు. వ్యాసాలు రాశారు. కొన్ని డిటెక్టివ్ నవలలు రాసారు. టీవీ సీరియల్స్‌లో, అగ్నిప్రవేశం, స్టూవర్టుపురం పోలీస్‌స్టేషన్ మొదలైన చిత్రాల్లో కూడా నటించారు. న్యూఢిల్లీలోని నేషనల్ స్కూల్ ఆఫ్ డ్రామాకి విజిటింగ్ ఫాకల్టీగా చేశారు. అలాగే ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని థియేటర్ ఆర్ట్స్ విభాగానికి, సెంట్రల్ యూనివర్శిటీకి కూడా విజిటింగ్ ఫాక్టల్టీగా ఎందరో విద్యార్థులకు మేకప్‌లో శిక్షణనిచ్చారు అడబాల. అనేక సత్కారాలు, పురస్కారాలు అందుకున్నారు. నాటకమే జీవితంగా బ్రతికిన వీరు మార్చి 15న హైదరాబాద్‌లో కన్నుమూసారు.

## సీనియర్ పాత్రికేయులు వాసిరెడ్డి మృతి



సీనియర్ పాత్రికేయులు వాసిరెడ్డి సత్యనారాయణ మార్చి 22న తుదిశ్వాస విడిచారు. ఆయన పత్రికా, రచనా వ్యాసంగంలో దాదాపు 47 ఏళ్లపాటు కృషి చేశారు. గుంటూరు జిల్లా తాడికొండ మండలం కంతేరులో ఆయన 1934 ఆగష్టు 30న జన్మించారు. "లాం" గ్రామంలో అమ్మమ్మ గారింట పెరిగారు. అక్కడే ప్రాథమిక, మాధ్యమిక విద్య, ఎస్‌ఎస్‌ఎల్‌సి చదివారు. గుంటూరు ఏసి కళాశాలలో ఇంటర్మీడియట్, హిందూ కళాశాలలో డిగ్రీ చదివారు. 'జనశక్తి' 'ప్రజాశక్తి ఆ తర్వాత 'ఈనాడు పత్రికల్లోనూ వాసిరెడ్డి పనిచేశారు. ఈనాడులో పనిచేసినప్పుడు రైతు సమస్యలపై ఆయన అధ్యయనం చేసి రాసిన వ్యాసాలు రోజు కొక్కటి చొప్పున వరుసగా 30 రోజులపాటు ప్రచురించారు. 1986లో 'ఈనాడు' డైరెక్టర్‌గా పనిచేశారు. ఆ తర్వాత ఆయన బెంగాలీ దినపత్రిక 'గణశక్తి'కి ఆంధ్రప్రదేశ్ వార్తలు అందించే బాధ్యత చేపట్టారు. ఒకే పంటపై ప్రయోగాత్మకంగా వ్యవసాయ విజ్ఞాన మాస పత్రిక 'పంచదార చెరుకు'ను దాదాపు 28 ఏళ్ళుగా నడుపుతున్నారు. కోళ్ల పెంపకంపై 18 సంవత్సరాలుగా 'పౌల్ట్రీఫార్మర్' అనే మాసపత్రికను నడుపుతున్నారు. మొత్తంగా ఆయన 47 సంవత్సరాలపాటు పత్రికా, రచనా వ్యాసంగంలో నిమగ్నమై ఉన్నారు. కొత్తగా పత్రికా రచనలోకి అడుగుపెట్టిన యువకులెందరికో ప్రోత్సహం అందించారు.

## సి. ధర్మారావు మృతి



తెలుగు భాషోద్యమ సమాఖ్య మాజీ అధ్యక్షుడు సి. ధర్మారావు (80) చికిత్స పొందుతూ మార్చి 18 రాత్రి తుదిశ్వాస విడిచారు. తెలుగుభాష వికాసం, కోసం ధర్మారావు ఎనలేని కృషి చేశారు. ఇటీవలే కొంతమంది భాషాభిమానులతో కలిసి ఆయన న్యాయపదకోశాన్ని తయారుచేశారు. జీవితాంతం తెలుగు భాష అభివృద్ధి కోసం ధర్మారావు కృషి చేశారని జెపి నివాళులర్పించారు. కృష్ణాజిల్లా పెద్ద అవుటపల్లి గ్రామంలో 1934లో సీతారత్నం, నాగభూషణం దంపతులకు ఆయన జన్మించారు. వివిధ జిల్లాల్లో ఉద్యోగ బాధ్యతలు నిర్వహించిన ప్రభుత్వ సంయుక్త కార్యదర్శి హోదాలో ఉద్యోగ విరమణ చేశారు. అనంతరం నాలుగున్నరేళ్ల పాటు ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘానికి కార్యదర్శిగా పనిచేశారు. వివిధ తెలుగు పత్రికల్లో కాలమిస్టుగా, వ్యాసకర్తగా కూడా ఆయన ప్రఖ్యాతి పొందారు. చలం సాహిత్య సంగ్రహం, ప్రేమించుకుందాం రండి, రవ్వలు పువ్వలు వంటి పుస్తకాలు వెలువరించారు. పలు పత్రికలలో కాలమ్స్ నిర్వహించారు.

## ఉర్దూ కవి అలీ జహీర్ మృతి



ప్రముఖ ఉర్దూ కవి, పండితుడు అలీ జహీర్ (67) మార్చి 16న తెల్లవారుజామున గుండెపోటుతో మరణించారు. ఆయనకు ఒక కుమారుడు, కుమార్తె ఉన్నారు. 1947లో పుట్టిన సయ్యద్ అలీ జహీర్ వృత్తిరీత్యా ఇంజనీరు రాత్‌కీ హజారత్ (1976), ఉంగ్లియో సే ఖూన్ (1986), దూస్ రా కదమ్ (1992), జబ్ జమినాన్ సే షాజర్ ఉగ్తేహై (1996), హజార్ మిసాల్ భకఫ్ సితారే (2005) మోజ్-ఎ-నద్రంగ్ (2009) ఉర్దూ కవితా సంపుటాలు వెలువరించారు. కొన్ని కవితలు ఇంగ్లీష్ అనువాదం 'సెవెనత్రీ దేస్ సెవెన్ హెవెన్స్ (1991)" 'దస్ రాస్' (2004) వ్యాస సంకలనం కూడా అందించారు. ఇక్బాల్ కవి, తానీషా చరిత్రలు సహా రేడియో, టివి స్క్రిప్టులు సమకూర్చారు. హైదరాబాద్‌కు చెందిన పలు సాహిత్య సాంస్కృతిక సంస్థలతో ఆయనకు అనుబంధం ఉంది. ఉర్దూ అకాడమీ సహా మూడు ఉత్తమ కవితా అవార్డులు పొందిన అలీ జహీర్ ఇరాన్, లిబియా, ఇంగ్లండ్, యుఎఇ, అమెరికా, టర్కీ తదితర దేశాల్లో పర్యటించారు. ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు, పార్శీ భాషల్లో నైపుణ్యం సంపాదించారు.

# కర్ణాటక సంగీత సామ్రాట్ పినాక పాణి కన్నుమూత



వందేళ్ళపాటు సంగీత సరస్వతి సేవలో అలసిన స్వరం శ్రీపాద పినాకపాణి (101) మార్చి 11వ తేదీన కర్నూల్‌లో కన్నుమూసారు. కర్ణాటక సంగీతాన్ని తెలుగునాటతంజావూరు బాణిలో కొత్త పుంతలు తొక్కించి సంగీత ప్రియులను ఓలలాడించిన శ్రీపాద పినాక పాణి 1913 ఆగష్టు 3న శ్రీకాకుళం జిల్లా ప్రియాగ్రహారంలో రామేశ్వరరావు, జోగమ్మ దంపతులకు జన్మించారు. రాజమండ్రికి చెందిన బి.ఎస్. లక్ష్మణ్‌రావు దగ్గర సంగీతం నేర్చారు. 18 సంవత్సరాల వయస్సులో ప్రముఖ వాయులీన విద్వాంసుడు ద్వారం వెంకటస్వామి నాయుడు వద్ద శ్రీపాద శిష్యరికం చేసారు. రంగరామానుజ అయ్యంగార్ లాంటి తమిళ సంగీత విద్వాంసుల సాహచర్యంలో కొన్ని కొత్త కృతులను సేకరించి తన ప్రతిభకు పదును పెట్టుకున్నారు. సంగీతంతో బాటు చదువునూ సమాంతరంగా కొనసాగించి 1938 ఎంబిబిఎస్ పూర్తి చేసారు. 1945లో మెడిసిన్‌లో ఎమ్.డి పూర్తిచేసి సివిల్ సర్జన్‌గా రాజమండ్రిలో పనిచేసారు. 1968లో పదవీ విరమణ తర్వాత సంగీతానికి జీవితం అంకితం చేసారు. మనోధర్మ సంగీతం, పల్లవి గానసుధ, మేళ రాగమాలిక, లాంటి రచనలు చేసారు. ఇవి కర్ణాటక సంగీతానికి అక్షరాభరణాలు. టి.టి.డీ వీరి రచలను "సంగీత సౌరభం" పేరుతో 4 సంపుటాలు ప్రచురించింది. పినాకపాణి అన్నమాచార్య కృతులు 108, త్యాగరాజు కృతులు 607, ముత్తుస్వామి దీక్షితులు 173, వరకు స్వరపరిచారు- "నా సంగీత యాత్ర" వీరి ప్రసిద్ధ గ్రంథం. ఎ.పిలో శాస్త్రీయ సంగీతానికి ఆదరణలేకపోవడంతో చాలా అసంతృప్తి ఆవేదన వ్యక్తం చేసేవారు. 1984లో పద్మభూషణ్ అవార్డ్‌తో భారత ప్రభుత్వం సత్కరించింది.

డైరీ

# 'రాత్రి సూర్యుడు' ఆవిష్కరణ



మార్చి 13న హైదరాబాద్ త్యాగరాయగాన సభలో జరిగిన కెరె జగదీష్ రచించిన "రాత్రి సూర్యుడు" దీర్ఘకవిత సంపుటి, ఆడియో కేసెట్ ఆవిష్కరణ సభ. చిత్రంలో

సామాజిక ప్రయోజనాలతో కూడిన కవిత్వం అన్ని విధాల రాణిస్తుందని, అలాంటి కవితలను రచనలను వెలుగులోకి తీసుకుని రావాల్సిన బాధ్యత ప్రతి ఒక్కరి మీదా ఉంటుందని రాష్ట్ర రోడ్డు మరియు భవనాల శాఖా మంత్రి ధర్మాన ప్రసాద్ రావు కోరారు. హైదరాబాదులోని శ్రీ త్యాగరాయ గాన సభావేదికపై మార్చి 13న అనంతపురం జిల్లా రాయదుర్గం పట్టణానికి చెందిన కెరె జగదీష్ రచించిన 'రాత్రి సూర్యుడు' దీర్ఘ కావ్యం పుస్తకం మరియు ఆడియో బుక్ ఆవిష్కరణోత్సవ సభ జరిగింది. ఈ సభలో రాత్రి సూర్యుడు పుస్తకాన్ని ఆవిష్కరించిన ధర్మాన ప్రసాద్ రావు తమ ప్రసంగంలో సమాజంలోని అంధుల జీవితాలలోకి పరకాయ ప్రవేశం చేసిన కెరె జగదీష్ ఇంతటి గొప్ప కావ్యాన్ని రచించడంలో విజయం సాధించడం అభినందనీయమని అన్నారు. కన్నడ మాతృభాష కలిగిన కుటుంబంలో పుట్టిన కెరె జగదీష్ తెలుగు భాషలో ప్రావీణ్యత సాధించి తమ రెండవ పుస్తకంగా రాత్రి సూర్యుడు దీర్ఘకావ్యాన్ని పూర్తి చేయడం హర్షణీయమని అన్నారు. ఈ ఆవిష్కరణోత్సవ కార్యక్రమంలో విశిష్ఠ అతిథిగా పాల్గొన్న ఐ.ఎఫ్.ఎస్. అధికారి - బుడిగి శ్రీనివాసులు రెడ్డి (న్యూఢిల్లీ) మాట్లాడుతూ సృష్టిలో అంధత్వం ఒక శిక్ష అయినప్పటికీ ఆ శిక్షను జీవన సాఫల్యం మరియు జీవన లక్ష్యం సాధించేందుకు శిక్షణగా మార్చుకుని ముందడుగు వేస్తే అంధత్వం అడ్డురాదని తెలిపారు. ప్రతి మనిషిలో ఏదో ఒక లోపం ఉన్నట్టే అంధులకు దృష్టిలోపం ఉంటుందని అంత మాత్రాన అంధులను నిర్లక్ష్యం చేయడం సభ్య సమాజానికి తగదని అన్నారు. ఈ సభకు అధ్యక్షత వహించిన సాంస్కృతిక శాఖ సలహాదారులు డా॥ కె.వి. రమణాచారి మరియు సాంస్కృతిక శాఖ సంచాలకులు డా॥ రాళ్ళ బండి కవితా ప్రసాద్‌లు తమ ప్రసంగాలలో రాత్రి సూర్యుడు దీర్ఘ కావ్యం సాహిత్య రంగంలో ఒక గొప్ప కావ్యంగా మిగిలిపోతుందని, అంధుల జీవితాలను వస్తువుగా తీసుకున్న గొప్ప భావ చిత్రాలతో చక్కని కావ్యాన్ని రచించిన కెరె జగదీష్ అభినందనీయుడని తమ హర్షం వ్యక్తం చేశారు. ఈ సభలో కవి, సీనియర్ జర్నలిస్టు బిక్కికృష్ణ రాత్రి సూర్యుడు పుస్తకాన్ని సమీక్షించగా కేంద్ర సంగీత నాటక అకాడమీ అవార్డు గ్రహిత డా॥ దీర్ఘాషి విజయభాస్కర్, ప్రముఖ కథకుడు డా॥ శాంతి నారాయణలతో పాటు చైతన్య ఆర్ట్స్ థియేటర్ వ్యవస్థాపకులు కె.కె. రాజు తదితరులు ప్రసంగించారు. ఈ సభాకార్యక్రమంలో భాగంగా 'రాత్రి సూర్యుడు' కావ్యకర్త కెరె జగదీష్ దంపతులను మంత్రి ధర్మాన ప్రసాద్ రావు, కె.వి రమణాచారి, రాళ్ళ బండి కవితా ప్రసాద్, దీర్ఘాషి విజయభాస్కర్, డా॥ శాంతినారాయణ తదితరులు గజమాలతో సత్కరించి జ్ఞాపికను అందజేశారు.



ఫిబ్రవరి 26న హైదరాబాద్‌లో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలంలో జరిగిన కొలకలూరి ఇనాక్ రచించిన 'ఓట్లాట' 'సాక్షి' నాటికల పుస్తకాల ఆవిష్కరణ సభ.



మార్చి 8న త్యాగరాయగాన సభ, హైదరాబాదులో అంతర్జాతీయ మహిళా దినోత్సవ వేడుకల సందర్భంగా నిర్వహించిన కార్యక్రమంలో ముఖ్య అతిథి సమాచార హక్కు కమీషనర్ పి.విజయబాబు ద్వారా మహిళా రత్న పురస్కారం స్వీకరిస్తున్న రచయిత్రి ఝాన్సీ కె.వి కుమారి. జి. ప్రగతి, డా॥ ఎన్ జయంతి రెడ్డి, బి. అరుణకుమారి, సి. రామకృష్ణ.



అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం సందర్భంగా ఫిబ్రవరి 21న గుంటూరు జిల్లా నంబూరు జి.ప. ఉన్నత పాఠశాల కళావేదికపై నాగిశెట్టి తాతయ్య నాయుడు రచించిన 'నాగిశెట్టి నానీలు' పుస్తకాన్ని ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం జాయింట్ రిజిస్ట్రార్ వాసా మాణిక్యాలరావు, ప్రఖ్యాత కవి రామడుగు వెంకటేశ్వర శర్మలు ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో ఎడమ నుండి కుడికి పెదకాకాని ప్రధానోపాధ్యాయులు పద్మేశ్వరరావు, ఆచార్య నాగార్జున విశ్వ విద్యాలయం జాయింట్ రిజిస్టార్ వాసా మాణిక్యాల రావు, నంబూరు ప్రధానోపాధ్యాయులు అన్నపురెడ్డి సుబ్బారావు, కవి నాగిశెట్టి తాతయ్య నాయుదు, పద్య కవి రామడుగు వెంకటేశ్వర శర్మ భాషోద్యమ నాయకురాలు సత్యవాణి ఉన్నారు.



ఫిబ్రవరి 24న విజయవాడ ప్రెస్ క్లబ్‌లో రమ్యభారతి సాహిత్య త్రైమాస పత్రిక ఆధ్వర్యంలో జరిగిన సోమేపల్లి సాహిత్య పురస్కారాల సభ. కొలిపాక శోభారాణిని సత్కరిస్తున్న అతిథులు.



సాహితీవేత్త డా॥పోరెడ్డి రంగయ్య గ్రంథం 'బడినానీలు' ఆలేరులో ఆవిష్కరిస్తున్న నల్లగొండ జిల్లా కలెక్టర్ ఎన్.ముక్తేశ్వర రావు. చిత్రంలో డిఇఓ ఆచార్య ఏ. జగదీష్, డా॥ ఓలేటి పార్వతీశం, ఆచార్య ఎన్.గోపి, కృతి స్వీకర్తలు మాడ నాగభూషణం గుప్త, అనసూయమ్మ దంపతులు ఉన్నారు.



ఫిబ్రవరి 26న హైదరాబాద్‌లోని పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయంలో కొలకలూరి భగీరథీ సాహిత్య విమర్శ పురస్కారం 2013ను అందుకుంటున్న డా. రాధేయ.



ఫిబ్రవరి 26న హైదరాబాద్‌లో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో కొలకలూరి భాగీరథీ సాహిత్య విమర్శ ప్రత్యేక పురస్కారం 2013న అందుకుంటున్న విహారి.

## ఉగ్రవాదాన్ని నిరసిస్తూ సాహిత్యసభ

విజయనగరం జిల్లా గజపతినగరంలో గ్రంథాలయంలో మార్చి2న ఉగ్రవాదాన్ని నిరసనగా సాహితీస్రవంతి ఆధ్వర్యంలో సాహిత్యసభ జరిగింది. ఈ సభలో చీకటి దివాకర్ మాట్లాడుతూ కవులు, సాహితీవేత్తలు తమ రచనల ద్వారా ఉగ్రవాదంపై అవగాహన కల్పించి సమాజాన్ని చైతన్యవంతం చేయాలని అన్నారు. ఉగ్రవాదాన్ని కొంతమంది తమ ఆధిపత్యం చాటుకొనేందుకు ప్రోత్సహిస్తున్నారని అన్నారు. ఉగ్రవాదం మూలాలను సాహితీవేత్తలు తెలుసుకుని రచనలు చేసి సమాజంలో ఉగ్రవాదం లేకుండా చేయాలని అన్నారు. డి.వి. శ్రీనివాసరావు మాట్లాడుతూ ఉగ్రవాదాన్ని నియంత్రించేందుకు మానవతావాదాన్ని అనుసరించాలని అన్నారు. జనవిజ్ఞానవేదిక జిల్లా అధ్యక్షులు గంద్రేటి లక్ష్మణరావు మాట్లాడుతూ ప్రతి ఒక్కరూ మతోన్మాదాన్ని వ్యతిరేకించాలని అన్నారు. ఈ కార్యక్రమంలో శ్రీనివాసరావు, పాయల మురళీకృష్ణ, సేర వాసుదేవరావు, మహేశ్; శంకరరావు, తదితరులు పాల్గొన్నారు.

## విద్యుత్ భారాలపై జనకవనం

అనంతపురం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో అనంతపురం నగరంలో జనవిజ్ఞానవేదిక కార్యాలయంలో మార్చి 23న విద్యుత్ భారాలపై జనకవనం జరిగింది. ఈ కార్యక్రమంలో ముఖ్య అతిథిగా ప్రముఖ కవి సూర్యసాగర్ పాల్గొని మాట్లాడారు. ఆయన మాట్లాడుతూ సహజ వనరులైన బొగ్గు, నీటిని బహుళజాతి సంస్థలకు ఇవ్వకుండా ప్రభుత్వమే నిర్వహిస్తే ప్రజలపై భారం పడకుండా ఉంటుందని అన్నారు. ఈ కార్యక్రమానికి సాహితీస్రవంతి జిల్లా అధ్యక్షులు తగరం క్రిష్ణయ్య అధ్యక్షత వహించారు. సాహితీస్రవంతి రాష్ట్ర కమిటీ సభ్యులు పి. కుమారస్వామి, మాజీ కార్పోరేటర్ డా. ప్రసూన తదితరులు సభలో మాట్లాడారు. ఆకుల రఘురామయ్య, మిద్దెమురళీకృష్ణ, మధురశ్రీ, షేక్ రియాజ్ అహ్మద్, జూటూరి షరీఫ్; సురేష్; జాగర్లపూడి శ్యామసుందరశాస్త్రి, భాస్కర వరలక్ష్మి, వై. సూర్యనారాయణ రెడ్డి, రామలింగారెడ్డి, వెంకటేష్ తదితరులు జనకవనంలో పాల్గొని విద్యుత్ భారాలను నిరసిస్తూ స్వీయ కవితలు చదివి వినిపించారు.




హైదరాబాద్‌లోని ఆంధ్రసారస్వత పరిషత్ తరపున ప్రధానం చేసే డా. కె. అంజిరెడ్డి సాహిత్య పురస్కారాన్ని 2013కు ప్రముఖ కవి డా. ఎన్.గోపి అందుకుంటున్న దృశ్యం. చిత్రంలో జి. రామకృష్ణారావు, డా. గోపి, సారస్వత పరిషత్ అధ్యక్షులు డా. సి. నారాయణరెడ్డి, డా. జె. చెన్నయ్య ఉన్నారు.



2013 సంవత్సరానికి 'శ్రీపాదరావు స్మృతి పురస్కారం' అందుకుంటున్న ప్రముఖ కవి డా. ఎన్. గోపి. చిత్రంలో కేంద్రమంత్రి పళ్ళంరాజు, రాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్. కిరణ్‌కుమార్ రెడ్డి, శ్రీపాదరావు కుమారుడు రాష్ట్రమంత్రి డి. శ్రీధర్ బాబు, కవయిత్రి ఎన్. అరుణ ఉన్నారు.



మార్చి 3న హైదరాబాద్‌లో త్యాగరాయగానసభలో రాగరాగిణి సంస్థ నిర్వహించిన 'తెలుగు విమర్శ-పరిణామం' గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న డా. సి. నారాయణరెడ్డి. చిత్రంలో ద్వానా శాస్త్రి, ఆచార్య ఎల్లూరి శివారెడ్డి, శ్రీలత, భైస దేవదాసు తదితరులు ఉన్నారు.



విశాఖపట్నంలో ఫిబ్రవరి 27న జరిగిన 'నవ్యకవితారూపం నానీ-వివేచన' గ్రంథావిష్కరణ సభ. చిత్రంలో పుస్తకాన్ని ఆవిష్కరించిన ప్రముఖ కవి ఆచార్య ఎన్. గోపి, సాహితీ విశ్లేషకులు రామతీర్థ, రాష్ట్ర అధికార భాషాసంఘ సభ్యుడు డా. ఎ. గోపాలరావు, వై.యస్.ఆర్. జిల్లా ట్రిపుల్ ఐటి విజిటింగ్ ప్రొఫెసర్ ఎలవర్తి విశ్వనాథ రెడ్డి, గ్రంథ రచయిత డా. చింతకింది శ్రీనివాసరావు, సాహితీ విమర్శకుడు ఎల్.ఆర్. స్వామి, కవి ఎస్. రాఘ మొజాయిక్, సాహిత్య సంస్థ ప్రతినిధి జగద్ధాత్రి ఉన్నారు.

### గమనిక

సాహిత్య ప్రస్థానంకు తమ రచనలను ఈ మెయిల్ ద్వారా పంపించేవారు ఇక నుండి sspraSthanam@gmail.com మెయిల్‌కు పంపించగలరు.




మార్చి 3న అనంతపురంలో జరిగిన 'సౌందర్య సృజన' పుస్తకావిష్కరణ. చిత్రంలో లంకా ప్రసాద్, ఎల్.ఆర్. వెంకటరమణ లలితా ప్రభాకర్, కె.ఎస్. రామారావు, హరిశ్చంద్ర రామ, డా॥ మూల మల్లిఖార్జున రెడ్డి, లక్ష్మీరెడ్డి, వై. లోకేశ్వరరెడ్డి, విజయా ఉన్నారు.



ఫిబ్రవరి 24న ఖమ్మం జిల్లా, ఖమ్మం నగరం, ఖానాపురం హవేలికి చెందిన రాచమళ్ళ ఉపేందర్‌ను 2012-సోమేపల్లి పంచమ పురస్కారంతో సత్కరిస్తున్న ప్రముఖ రచయిత విహారి, పురస్కార వ్యవస్థాపకులు, సోమేపల్లి వెంకటసుబ్బయ్య, రమ్యభారతి ఎడిటర్ చలపాక ప్రకాష్ తదితరులు.



ఫిబ్రవరి 26న తెలుగు విశ్వ విద్యాలయంలో కొలకలూరి విశ్రాంతమ్మ పరిశోధన పురస్కారం 2013ను అందుకున్న డా.యం.యం. వినోదిని.



మార్చి 2న మద్రాస్‌లోని పొట్టి శ్రీరాములు మెమోరియల్ హాలులో డా॥ వి.ఆర్. రాసాని పుస్తకాల ఆవిష్కరణ సభ. చిత్రంలో డా॥ వి.ఆర్.రాసాని, డా॥ మేడిపల్లి రవికుమార్, వి. షణ్ముగం డా॥ మాడభూషి సంపత్కుమార్

## కొండేపూడి నిర్మలకు ఉమ్మడిశెట్టి సాహితీ రజతోత్సవ పురస్కారం



ఉమ్మడిశెట్టి సాహిత్య రజతోత్సవ పురస్కారం - 2012 కోసం ప్రముఖ స్త్రీవాద కవయిత్రి శ్రీమతి కొండేపూడి నిర్మల గారి 'నివురు' కవిత్వం ఎంపికైందని అవార్డు వ్యవస్థాపకులు డా॥ రాధేయ ఒక ప్రకటనలో తెలియజేశారు. ఈ అవార్డు న్యాయనిర్ణేతలుగా డా॥ కె. రామమోహనరాయ్, డా॥ మేడిపల్లి రవికుమార్, డా॥ బన్న అయిలయ్య గార్లు వ్యవహరించారని తెలిపారు. ఈ రజతోత్సవ పురస్కారసభ జూలై నెలలో అనంతపురం జరుగుతుందని డా॥ రాధేయ తెలియజేశారు.

## వేంపల్లి షరీఫ్‌కు సాహిత్య అకాడమీ యువ పురస్కారం



కథా రచయిత, జర్నలిస్టు వేంపల్లి షరీఫ్‌కు కేంద్ర సాహిత్య అకాడమీ యువ పురస్కారం 2012 లభించింది. షరీఫ్ కథల సంపుటి 'జుమ్మా'కు ఈ పురస్కారం ప్రకటించారు. మార్చి 22న అస్సాం రాజధాని గౌహతిలో షరీఫ్ కు ఈ పురస్కారాన్ని అందించారు

## హాస్య నాటికలకు పురస్కారం

ద్వా.నా.శాస్త్రి 66వ జన్మదినోత్సవం సందర్భంగా కిన్నెర ఆర్ట్ థియేటర్స్ వారు జూన్ 15న హైదరాబాద్‌లో త్యాగరాయగానసభలో ఒక కార్యక్రమం నిర్వహిస్తున్నట్లు ఆ సంస్థ ప్రతినిధి ముద్దాళి రఘురామ్ ఒక ప్రకటనలో తెలిపారు. ఈ సందర్భంగా "ద్వా.నా-కిన్నెర" పురస్కారాన్ని సరికొత్త హాస్యనాటికలకు ఇవ్వడం జరుగుతుందని తెలిపారు. ఉత్తమ హాస్యనాటికకు ఐదువేలు, ద్వితీయ ఉత్తమ హాస్యనాటికకు మూడువేలు అందజేస్తామని తెలిపారు. ప్రదర్శన సమయం 45ని॥లకు మించకుండా, అసభ్యత లేకుండా ఉండాలని కోరారు. నాటికలను శ్రీమతి డి. దుర్గ, 1-1-428, గాంధీనగర్, హైదరాబాద్ - 500 080 చిరునామాకు మే 15లోపు పంపించవలసిందిగా కోరారు.

## భద్రాచలంలో కథా సదస్సు




భద్రాచలం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ఫిబ్రవరి 24న కథా సదస్సు జరిగింది. ఈ సభలో పలువురు ఔత్సాహిక కథకులు పాల్గొన్నారు. మాగంటి సూర్యం, సాధనాల వెంకటస్వామినాయుడు సమన్వయంలో జరిగిన ఈ కథా సదస్సులో అమ్మిన శ్రీనివాస రాజు మాట్లాడుతూ ఎక్కువ కాలం గుర్తుండేది మంచి కథ అన్నారు. చాలా మందికి కథ ప్రారంభించడం రాదు. అది ఒక కళ, కొందరు వ్యాసాలను రాసి కథ అంటారు అని అన్నారు. మండవ సుబ్బారావు మాట్లాడుతూ కథలు వేరు. కథానిక వేరు. 100 ఏళ్ళు నిండింది కథానికకు, కథకు కాదు అన్నారు. కథానిక ఆధునిక రూపం అన్నారు. శిరంశెట్టి కాంతారావు మాట్లాడుతూ సమాజంలో తన చుట్టూ జరుగుతున్న వాటిని పసిగట్టాలి అన్నారు. జ్వలిత మాట్లాడుతూ బాధితుల కోణంలో రచయితల స్పందించినప్పుడే రచయిత సమాజానికి ఉపయోగపడే విధంగా రాయగలుగుతారని అన్నారు. కె.వి.ఎన్. మూర్తి, మాల్యశ్రీ, తాతోలు దుర్గాచారి, అరుణకుమారి, రామరాజు, తులసీదాస్, బుచ్చిరాములు తదితరులు ఈ సదస్సులో పాల్గొన్నారు.

## విజయనగరంలో మాతృభాషా దినోత్సవం

విజయనగరం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ఫిబ్రవరి 21న మాతృభాషా దినోత్సవం జరిగింది. విజయనగరంలోని గురజాడ నిలయంలో జరిగిన ఈ కార్యక్రమంలో సాహితీస్రవంతి రాష్ట్ర కమిటీ సభ్యులు చీకటి దివాకర్ మాట్లాడారు. మానవ సమాజంలో సమూహాలుగా జీవించిన తరుణంలో సామూహికత నుండి భాష ప్రకటనా మాధ్యమంగా భాష ఉద్భవించిందని అన్నారు. ఇతర భాషల సాంగత్యాన్ని తనలో ఇముడ్చుకొని భాష అభివృద్ధి చెందుతుందని, అన్ని భావలకూ సమానహోదా ప్రభుత్వం కల్పించాలని అన్నారు. ప్రపంచ రాజకీయాల ఫలితంగా కొన్ని భాషలు ఆధిపత్య ధోరణి వహించాయని, ఉర్దూ, ఆంగ్ల భాషలు ఆ కోవకు చెందినట్టివని అన్నారు. ఈ సమావేశంలో బాలాజీ మాష్టారు తెలుగు భాష ఔన్నత్యాన్ని పద్యరూపంలో ఆలపించారు. బద్రి కూర్మారావు తెలుగు భాష చరిత్రను మిగిలిన లిపిలేని భాషల ప్రాధాన్యతను వివరించారు. ఎస్.వి.ఆర్. కృష్ణారావు ప్రాభవం కోల్పోతున్న తెలుగుభాష స్థితిని గణాంకాలతో వివరించారు. శ్రీమతి అనురాధ, మొయిద శ్రీనివాసరావు, చెళ్ళపిళ్ళ శ్యామల, ఇనుగంటి జానకి, మానాపురం రాజాచంద్రశేఖర్, రెడ్డి శంకర్రావు, విజయేశ్వరరావు తదితరులు కవితలు చదివి మాతృభాషా చర్చలో పాల్గొన్నారు. చీకటి చంద్రికారాణి 'అక్షరాలు 5/ ఈ అచ్చ తెలుగు భాషకు/ అ, ఆ, ఇ, ఈలు తొలినక్షత్రాలు" అంటూ పాడిన పాట అలరించింది. హృషీకేశ్, బొంతలకోటి లలిత తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

- ఇల్ల ప్రసన్నలక్ష్మి

## చిరునామాల కోసం విజ్ఞప్తి

తెలుగులో సైన్స్ ఫిక్షన్ కథల సంకలనం వేసే ప్రయత్నంలో భాగంగా 30 కి పైగా కథలను సేకరించినట్లు డా. నాగసూరి వేణుగోపాల్, డా. నామిని సుధాకర్ నాయుడు ఒక ప్రకటనలో తెలిపారు. 1927 నుండి నేటి దాకా వెలువడిన వాటిలో నుండి కథలు ఎంపికచేశామని తెలిపారు. అయితే వారిలో కొందరి రచయితలు లేదా వారి వారసుల చిరునామాలు లభించలేదని వారి వివరాలు తెలిసిన వారిని తమకు తెలుపవలసిందిగా కోరారు. ఆ కథలు - 1. ఎస్.వి.ఎస్. రావు - గుడ్ ఓల్డ్ వరల్డ్ (తెలుగు భాషాపత్రిక, ఏప్రిల్ 1972) 2. సి. రామచంద్రరావు - నెగటివ్ గ్యాలక్సీ (తెలుగు భాషాపత్రిక అక్టోబర్ 1972) 3. మహమ్మద్ ఫిరోజయా- సూక్ష్మజీవులు (తెలుగు భాషాపత్రిక, ఏప్రిల్ 1973) 4. వేమూరి- బ్రహ్మాండం బద్ధలయ్యింది, తెలుగు భాషాపత్రిక, అక్టోబర్ 1973) 5. యం. హేమలత - కన్నతల్లి (ఆంధ్రసచిత్ర వారపత్రిక, మే 4, 1979) 6. పిల్లలమర్రి రామలక్ష్మి - జెనెసిస్ (ఆంధ్రప్రభ దినపత్రిక, ఏప్రిల్ 27, 1983) 7. శంఖవరం సరోజా సింధూరి - వరదగుడి (ఆంధ్రప్రభ దినపత్రిక, మే 4, 1983 8. యం. అన్నపూర్ణా రెడ్డి - నూట పద్నాలుగు (జగతి మాసపత్రిక, ఏప్రిల్ 1987) 9. వక్కలంక వెంకటరమణ - పున్నమినాటికి మళ్ళీ వస్తా (ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక డిసెంబర్ 30, 1993) 10. ఊడిగ మధుమారి- మనసున్న మనిషి కథ (ఆంధ్రజ్యోతి వారపత్రిక, మే, 12, 1995) 11. రావేటి రామకృష్ణారావు - మరో ప్రపంచం (ఆంధ్రభూమి మాసపత్రిక, డిసెంబర్ 1991.



మార్చి 9వ తేదీ జీ.ఎస్ రామకృష్ణ మిత్రమండలి ఆధ్వర్యంలో రామకృష్ణ సీనియర్ కవిత సంపుటి 'హృదయ స్పందన' గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న ఎ.పి హైకోర్టు జడ్జి బి. చంద్రకుమార్ వేదికపై విజయశ్రీ, అన్వర్ భాష, జి. అప్పారావు, చక్రవర్తి, రామకృష్ణ, జి వెంకటరెడ్డి, పి. సుబ్బారావు, ఎన్. గోపాలకృష్ణ, లలితా జగన్ తదితరులు.



మార్చి 17న హైదరాబాద్‌లో రవీంద్రభారతిలో జరిగిన డా॥ పెళ్ళకూరు జయప్రదా సోమిరెడ్డి సాహితీ స్వర్ణోత్సవ సభ. చిత్రంలో జయప్రద దంపతులు ఉండేలు మాలకొండా రెడ్డి, పోతూరి అన్నపూర్ణ, డా॥ సి.నారాయణరెడ్డి, డా॥ ఎన్.గోపి, కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి, ఎం. రఘురామ్

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

**If Un delivered please return to :** Prasthanam, C/o M.H.Bhavan, Plot No. 21/1, Azamabad
Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020 (A.P), Ph: 040-27660013, Cell: 9490099059



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO2A148 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Kodveed |
| పేజీలు విడదీసినది | Kodveed |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | GOOD |